# కామకళ

(నీతిబోధకమైన ఆరంకముల నాటకము.)

గీ. ముదముతోడను బతిఁగొల్చు ముదితలెల్ల
కామకళ బోలిముక్తిని గాంత్రుగాక
హేమకళ బోలివర్తించు హీనమతులు
కష్టపడుగాక నిలయందె కనులుబోయి.

గ్రంథకర్త.


పెరుమాళ్ళ వీర్రాజుగారు.



ప్రకాశకులు.

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు

నేషనల్ బుక్కుడిపో, రాజమండ్రి

రెండవకూర్పు 1000.

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల
రాజమండ్రి.

1927






(వెల 1—0—0

# కృతిసమర్పణము.

సీ. శ్రీహరిహరులను సేవించి తత్ఫల
దానమందినయట్టి ధన్యురాలు
తనవారు పెరవార లనుభేద మెరుగక
సమదృష్టి బరపిన సదయురాలు
నిరతాన్నదానమే నియతిగా తుదికంట
ప్రాకులాడినయట్టి భవ్యురాలు
పెనుమాళ్లవంశంపు బిరుదంపుకోడలై
యశముగడించిన యనఘురాలు

గీ. బుచ్చివేంకటరాయుని భోగ్యలక్ష్మి
నాదుతల్లి యశోవల్లి నరసమాంబ
చరణములకు నమస్కార శతముతోడ
నర్పణమొనర్తు మత్కృతి నధికభక్తి.

గ్రంథకర్త.

## ప్రకటన

లిఖితరూప మగు నాయనుమతిని పొందనివారీ నాటకమును
ప్రదర్శింప గూడదు.

గ్రంథకర్త.

# రెండవకూర్పు.

## మనవి

మహాశయులారా!

నే నీనాటకము 1926 సంవత్సరము జూనునెలలో వ్రాయ ప్రారంభించి నెలదినములలోపలనే ముగించినాడ. నాటకము వ్రాయుపాటి భాషాజ్ఞానము నాకు లేకపోవుటచేతనున్ను, పరిశ్రమప్రయత్న మగుటచేతనున్ను, నవమాసములు పూర్తికాకుండ జన్మించిన శిశువు పోల్కి గతించునేమో యని పరిపరివిధముల లోలోన భయమొందినాడ. దైవానుగ్రహముచే నట్లుగాకపోవుటయేగాక, మొదటికూర్పు వేయి ప్రతులున్ను నెలదినములలోపలనే ఖర్చుపడుటయు, ప్రతివారి కరమలంకరించి, వారలను సంతసింపజేయుటయు జూడ నాకున్న భయము సంతసంబుగా మారినది. ఈ రెండవకూర్పునందు వలయుచోట్ల కొన్నిపద్యములు పొందుపరచి, అచ్చటచ్చటనున్న మోటుపదములు మార్చినాడ. ఇంకను తప్పులుండవచ్చును. పండితోత్తములు దయతో తెలియపర్చిన ముందుకూర్పునందు సవరించుకొనువాడ.

రాజమండ్రి.

8—7—1927

ఇట్లు,

పెనుమాళ్ళ వీరాజు,

# ఇందలి పాత్రములు

—:పురుషులు:—

1 శ్యామసుందరమూర్తి—కథానాయకుడు
2 సుందరరావు
3 కామిసెట్టి
4 ఆనందరావు —విటులు
5 కందర్పుడు
6 సాహేబు—బట్టలవర్తకుడు
7 వెంకప్ప—కామకళసోదరుడు
8 గోపీచందు—మారువాడీ
9 కొండయ్యనాయుడు—అమీనా
10 కల్లుగంగయ్య
11 యాచకుడు

—:స్త్రీలు:—

1 కామకళ—(వేశ్య) కథానాయిక
2 నరహరి—కామకళతల్లి
3 హేమకళ—నరహరి కొనిపెంచిన బాలిక
4 ముసలిది
5 పిల్ల
6 దేవయాన —సానులు
7 కమలాక్షి

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

# కామకళ

నాంది

గంగకు గౌరికిన్ సవతికయ్యము నిత్యముఁ దీర్పలేక యా
గంగను శీర్షమందునిడి గౌరికి నర్ధశరీర మిచ్చి మే
ల్బంగరుబొమ్మలౌ సతుల లాలన జేయుచు సౌఖ్యమొందు న
య్యంగజమర్దనుండు మిము నాదర మొప్పఁగ నేలుఁగావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్రి—(తనలో) అహహో! నే నెంతధన్యుఁడను.

గీ. వివిధవిద్యల మహిమచే వెలయువారు
పెక్కుసంపద లంది పెం పెక్కువారు
కూడియుండిరి దేవేంద్ర కూటమట్లు
ఔర! కనుపండువయ్యెను హాయిగలిగె.

వచ్చినందులకు సంతసించుచుంటినేగాని, సరసకవితా సామ్రాజ్యధౌరేయులును, సర్వజ్ఞులునగు నీసదస్యుల యుల్లంబులు రంజిల్లజేయుటెట్లో నాకు దోచకున్నది. (యోజించి) ఔటతలనిడి, రోకటిపోటునకు జంకిన, నెంతఫలమో తోచక చింతిల్లినను, అంతియే ఫలము కావున, నాప్రేయసి నిటు రప్పించి యోజింతుఁగాక,

క. రావే బంగరుబొమ్మా!
రావే నారత్నజలధి, రావేఁబొమ్మా
రావేమి యాలసింపక
రావే చేదోడుగాగ రయమున సభకున్.

(తెరలో)

గీ. మేనిసొబగుతో భూషలు మేలమాడ
కురులయందము రెట్టింప విరుల ముడిచి
సూత్రధారునిసతియన షోకు(దీర్చి
వచ్చుచుంటిని వేగిర పడగవలదు.

సూత్రి—(ఆలకించు టభినయించి) ఏమి! యింకను బయటికి, యీాడి పడక లోపలనుండియే తెగసాగుచుంటివే?

నటి—(అద్దము,దువ్వెనయు చేతబట్టుకొని ప్రవేశించి) ఏమూ ధూర్తము

సూత్రి—నాధూర్తమున కేమిగాని, అయినదా?

నటి—ఏది?

సూత్రి—నీ సింగారింపు.

నటి—ఆవగింజలో నరవీసము కాలేదు.

సీ. ఉంగరంబులరీతి ముంగుర్లు సవరించి
మెరుగారు మైనము జరచవలయు
మోటుగ లేకుండ మొగమున రంగార్చి
యామీాద నభ్రకం బద్దవలయు
నద్దిన మోమును నద్దంబులో(జూచి
తిలకంబు తీరుగా దిద్దవలయు
కండ్లకు నద్దాలు కరమొప్ప(దగిలించి
రిష్టువాచిని కైధరింపవలయు
గీ. గౌను జాకెట్టు బెల్టును గట్టవలయు
పునుగు జవ్వాది మేనెల్ల(బూయవలయు
వేళ్ళసందున సిగరెట్టు బెట్టవలయు
నింక నున్నవి జేయగా నెన్నియెన్నొ!

సూత్రి—ఇప్పటికే గంగిరెద్దువలె నలంకరించుకొంటి వింకనుఆశదీ
రలేదా?

నటి—మేము గంగిరెద్దులమైన మీరు బండెడ్లుగారా? దానికేమి

గీ. తొంటిదినములు చెల్లెను తూలనాడ
భర్తవనుచును గర్వించి భయము వీడి
తిట్లుదిట్టిన పడబోను తెలిసికొనుము
నీదు మొగమోట మిక మీఁద నిల్వబోదు.

సూత్రి—ఏమీయసంబద్ధ ప్రలాపములు? మర్యాదవీడి "నీవునీవని" వాకొనుచుంటివే?

నటి—ఇందేమితప్పున్నది? ఇంతవరకును నొక్కరినే నమ్మియుండుటచే యేకవచనము ప్రయోగించితిని. పలువురసఖ్యతబడసినప్పుడు బహువచనముతో సంబోధించెదనులెండు. సరియా?

సూత్రి—వలదు వలదు. తన్నినను సంతసించెదనుగాని ఆపనిమాత్రము చేయవలదు.

నటి—గీ. మీరు పదిమందిసతులతో మెలఁగదగును
స్త్రీలు మాటాడుమాత్రాన చెడిపెలండ్రు
పూరుషావళి జేసిన పుణ్యమేమి?
పడఁతు లిప్పట్ల జేసిన పాపమేమి?

దీనికి ముందు నాకు సమాధానమిండు.

సూత్రి—పురుషుడైనంతమాత్రముచేఁ గులసతినివీడి, యుపకాంతల గూడుట ధర్మవిరుద్ధమే.

నటి—అటుల జరుగుచుండెనా లేదా?

సూత్రి—సుదతీ! చెప్పెదను వినుము—

సీ. వృద్ధుండు పసిబాల బెండ్లియాడుటచేత
వ్యభిచారభూతంబు వదలదయ్యె
విధవలపెండ్లిండ్లు వేడ్కఁజేయుటచేత
గన్నియ లల్లాడు కాలమొదవె
వరవిక్రియంబులు ప్రబలియుండుటచేత
సతిపతులకు పొత్తు సన్నగిల్లె
సంసారులెందరో జారిణులగుటచే
మానాభిమానంబు మంటగలిసె
గీ. పరమపావనంబైన యీ భరతదేశ
మిన్నిపాట్లకు గారణం బెంచిచూడ
స్త్రీల దోషంబులేదని చెప్పనగును
పురుషలోపంబుచేతనె బుట్టెనతివ!

నటి—తప్పు మీయందుననే యుండెఁగదా? మాకును స్వేచ్ఛనిచ్చి మీతో సమానముగ జూచినచో నిన్నియిక్కట్టులుండునా?

సూత్ర—ఓహో! అదియా నీయూహ.

గీ. అట్టులుండిన నిప్పుడే యాదరమున
చేత గాజులు తొడిగించి స్వేచ్ఛబడసి
కత్తికోతలఁబెట్టక కలికి నన్ను
నీదు సతిగను నేలుము వాదమేల?

(కరములు ముందుకు సాచును.)

నటి—(సిగ్గుచే తలవంచుకొని) నాథా!

సూత్ర—నాథ గాదు- అనాథా యని పిలుభుము.

నటి—(నవ్వుచు దరిజేరి) నాథా! యింతకుముందు మీరు సభ్యుల నెట్లు సంతసబెట్టుదుమనాయని యాలోచించుచుండ నేనది గ్రహించి

చి స్వరము నాయత్తపరచి నూతననాటకమున కుపోద్ఘాతము
ప్రారంభింప మీరిట్లనుమానపడి నాపై గినియుటపాడియా?

సూత్ర—నూతన నాటకమా? ఏదది?

నటి—ఆర్యా! మీకు తెలియనేలేదా?

గీ. ఘనుడు పెరుమాళ్ళవంశ సంజనితుఁడైన
బుచ్చివేంకటరాయని ముద్దుకొడుకు
కామకళ పేర బరగు శృంగారనాట
కంబు రచియించిగనఁడె ప్రఖ్యాతి జగతి.

సూత్ర—(భుజముపై చేయివేసితట్టుచు) ఓహో! వీరరాజు రచియిం
చినదా? (సంతస మభినయించుచు) ప్రియసీ! సర్వజనాహ్లాద
కరంబగు చక్కనినాటకమెంచి నాశ్రమ వాయఁజేసితివి. కాని
నేనొక్కందులకు మాత్రము భయపడుచున్నవాఁడను.

గీ. నటకులుసమర్థులైనచో నాటకంబు
యశముగాంచెడి లేకున్న నదియె కవికి
దుర్యశముఁదెచ్చుటేగాక తోయజాక్షి!
నీకునాకును చీవాట్లు నిశ్చయంబు.

నటి—(నవ్వుచు) నాథా! మీరిట్టిసంశయంబుల మునుంగ వలదు.
పాత్రధారులు కడుసమర్థులగుటచేతనేగదా, నేనీనాటకమును,
ప్రేర్కొనుటకు కారణము.

సూత్ర—అటులైనచో,

గీ. వేళమీరెను సభ్యుల వినువుదీర
మలయమారుతరాగంబు పొలయజేసి
పాటబాడుము కోయిల జోటిపాట
ఋతువతంసమగు వసంతఋతువు, గూర్చి.

నటి—చిత్తము.

(పాట.)

గనుసఖుడా ! మదిహాయిజనించెను - వింతగనిటను - వింతగ
నిటను ॥గను॥
కనుబూచిన మల్లెలువె - ల్లులతో - నపార - ముదమా
వసంతసుకాల - మనంగ - మదీయ - మనంబు - చెలంగె
నాహా ఆ ఆ ఆ ఆ ఆ ఆ ॥గను॥
యిదియే - ఋతురా - జగునెం - చగనూ - విలాస -
యుతుడా - సురూప - కుమారు - ననంగు - భజించి - తరిం
చు - లతాంగు - లారా ఆ ఆ ఆ ఆ ఆ ఆ ॥గను॥

(తెరలో)

హాయి హాయి ! ఏమి యీగాన మాధుర్యము.

గీ. సాంధ్యరాగంబుగ్రమ్మెను సానివాడ
రాగ మాలాపనంబయ్యె - రసికవరుల
లెండు లెండని మేలుకొల్పెడివిధాన
నిలునిలువుమిదే వచ్చెద కులుకులాడి.

నటి—(ఆలకించి) నాథా ! ఎవరో యిటు వచ్చుచున్నారు గాంబోలు!

సూత్రి—ఎవడో కామాంధుడు, నీగాన మాలకించి, వేశ్యగా దలంచి, జవా బిచ్చుచున్నాడు. వచ్చినను, రావచ్చును. నడివీధి మనము నిలుచుట తగదు. రమ్ము పోదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన.)



శ్రీపరమేశ్వ రార్పణమస్తు.

# కా మ క ళ

ప్ర థ మాం క ము.

(ప్రథమరంగము)

పు ర వీ థి.

(సుందరావు "సాంధ్యరాగంబుగ్రమ్మెను" అను పద్యముజదువుచుఁ బ్రవేశము.)

సుంద—(ఇటునటుజూచి) ఏమిది! ఎవ్వరును నిటగానరారే? (ఖించుక యోజించి) ఔరా! మోహముసుమీరిన తీపిగల పదార్థమీత్రిలోకంబుల వెదకినను గానరాదుగదా! అందునను,

గీ. తల్లిదండ్రులపై భక్తి తప్పఁజేయు
తనదు నర్ధాంగిపై గూర్మి తరిమివేయు
చంటిపాపలపై బ్రీతి చంపివేయు
సానెమాయల జిక్కిన నరుఁ డకట!

ఎంతటిజడదారుడైనను కాలకర్మవశమున వేశ్యకౌగిళ్ళ జిక్కెనేని పూర్వస్మృతియంతయు నశించుటయేగాక నీచత్వము సంభవించి దుర్గతులపాలగుట సిద్ధాంతమే. ఇంతకును మాతండ్రిగారు సంగీతవిద్యాగురువులగుటనుబట్టి కావ్యనాటకాలంకారరసాభినయంబులను నేర్చికొన నిప్పురిపణ్యాంగన లనుదినంబునుమద్గృహంబున కేతెంచుటంజేసి వారల నేను నామేనత్త కుమార్తెలపగిది నాదరించి యానందించుటచే మాజనకుండుప్రపంచముతోపాటు నన్ను విడనాడిపోయినను ధనలక్ష్మి నన్ను పెద్దమ్మకు నప్పగించినను, నేనీవెలకాంతల స్నేహంబు విడజాలనందున, నాకీయవస్థ సంభవించినది. ఏదియెట్టులున్నను మాజనకు

నియందుగలభక్తిచే గాబోలు, నేటివరకును నన్ను గౌరవమ్ము
గా జూచుచుండిరి. ఇదియును, నెంతవరకో. మావసంతసేనను
బిలతుగాక ! వసంతసేనా! వసంతసేనా ! (పిలుచును)

(తెరలో) గ్రామంబున లేదు, సంచారమేగినది.

సుం—ఎవరా జవాబిచ్చునది ?

(తెరలో) చెవులకు చత్వారమాయేమి ?

సుంద—ఓసి మరదలా! నీవటే ఎవరోయనుకొంటిని. కీరవాణీ! మీ
యక్క సంసారులతోడనా లేక సన్యాసులతోడనా సంచార
మేగుట?

(తెరలో) ఎందున గలసినను, మీరే కలువవలెనుగాని, మాకేల ?

సుంద—మేము బ్రతికియున్నంతవరకే మీభోగము.

(తెరలో) నీవుపోయిన నీతాత మరొకడు.

సుంద—సెబాస్. కుర్రముండవైనను, కుండ బ్రద్దలుకొట్టునట్లు జెప్పి
తివి. ఒకసారి తలుపుదీయుము.

(తెరలో) వీలులేదు.

సుంద—(తనలో) అనుకొన్నంతయు జరిగితీరినది. వసంతసేన లోపల
నుండియే యిట్లనిపించినది. ఇంతటితో నేటికి నిర్గమించుటయే
మంచిపని. రవంత కూనిరాగ మెచటనో వినబడినంతమాత్ర
మున నే పడిపోయినట్లు బరుగెత్తి వచ్చినందులకు తగినప్రాయ
శ్చిత్తమే జరిగినది. కానిమ్ము! ఇదివర కిట్టి వెన్ని జరిగియుం
డలేదు? ముందు జరుగనైయుండలేదు. అన్నిహంశములును
దెలిసియు నీముండకొంపలు వదలజాలకుండుట, జూడ
నాలో నాకే యాశ్చర్యము జనించును. ఇదియే తెలిసినమూ
ర్ఖత. (ప్రకాశముగా) మీయక్క వచ్చినపిమ్మట వత్తునులే.

(తెరలో) ఆఁ మంచిది.

సుంద—(తలనూపుచు నిష్క్రమించును)

## ద్వితీయ రంగము.

పరిదేశము.—విలాసపురమున వేశ్యగృహము.

(తెర లేచుసరికి కామకళ కూర్చుండును)

కామ—(అద్దమునందు మొగము జూచికొనుచు)

ఉ. చక్కని రూపసంపదయు జవ్వనపొంకము తేనెలొల్కు నా
చక్కని మోవిరంగు సరిచేడెలయందున సున్నయౌఁ గనన్
నిక్కము పూరుషాళి తమనీరజనేత్రల వీడకుందురే
చక్కెరబొమ్మయంచు మునిసంతతిగచ్చల నూడ్చకుందురే!

(పైట సవరించుకొనుచు) ఆహా! నాయందచందములను జూచికొని యేకాంతమందు నాలో నేనే సంతసింపవలసియున్నది. ఓపాండవపక్షపాతీ! నాకీయందచందములిచ్చి నన్నీకులములోఁ బడవేయుట నన్నేడ్పించుటకేగాని నవ్వించుటకుగాదు. నాయందైనను నీపక్షపాతబుద్ధిని మానితివిగావు. ఉన్నంతలోనే సరిపెట్టుకుని సంతసింపఁజూచుచుండ నదేమిచిత్రమో నాకు యుక్తవయస్సు వచ్చినదిమొదలు నేఁటివరకు

గీ. కుంటివారలో యంధులో కుష్ఠువాండ్రొ
త్రాగుబోతులో జూదర్లొ తప్పకుండ
సానులిండ్లకు వత్తురు సరసమాడ
సజ్జనుం డొకడును మము సాకఁరాడు.

ఇటువంటి నడపీనుగులు విటులుగావచ్చి నాసిగ్గులను కొల్లగొనుచున్నారు. వీరలతోఁ పొత్తుకన్న బండరాతినైనను పెనుమ్రాకునైనను గౌగలించిన మేలుగదా. ఈభ్రష్టులజూచినతోడనే మదనుండామడదూరము పారును. ఇప్పట్ల నాతని పుష్పసాయకంబులు నాయెడ పని జేయవనియు, వృథాశ్రమయనియు, యోడి

పోవుననియు భయము-ఎంత వేశ్యజాతిలో పుట్టినను మేమునును
నుజులమేగానిమట్టిబొమ్మలము కాముగదా. మాకుమాత్రము -
మోహమన్నది తెలియదా? తెలిసినంత మాత్రమున ఫలమేమి?
ఇటువంటి విటకాంౘజూచిన, అన్నమేరుచించునప్పుడు మో
హాంధకారము కనులఁగప్పగలదా? కొనిధరించు వస్తువా?
నేర్చికొనుటకు రాగమా? తనంతనేజనించును- ఎప్పుడు- కం
తువసంత జయంతాదులఁబోలిన కందర్పులను గాంచినప్పుడు.
అబ్బా!మాటదలంచినంతనే పుల్కలు మొయిఁ దోచుచున్నవే.
ఆహా! అటువంటి మహాభాగులను గాంచుభాగ్యము నాకు
గలదా; ఇదియొక అడియాస. వెర్రిభ్రమ. ఈయుద్యో
గము స్వీకరించిననాఁటనుండియు గాంచుటలేదా?

గీ. రూపముండినవానికి ఢంక నున్న
రూకలుండిన యాతడు పోకునున్న
రెండుగల్గిన యతడు రా కుండనున్న
బాధలొందుచు నిటుల నా బ్రతుకునున్న.

ఔరా! నాయావజ్జీవ. మిటులనే గడపవలయునుగాబోలు! (యొడలి
వంక జూచికొనుచు)

సీ. కనుదృష్టి సోకిన కగ్గెడు గుబ్బలు
పలువురచేతను బడగవలసె
పువ్వులతో రువ్వ నొవ్వెడు నా మేను
భ్రష్టుల కౌగిళ్ళ పాలబడియె
అద్దాల మించిన నపరంజి చెక్కిళ్ళు
మొద్దులు మనసార ముద్దుబెట్టె
రత్నంపు రంగుతో రాజిల్లు నా మోవి
కూళల మునిపంట కొరుకఁబడియె

గీ. భళిభళీయంచు నాసిగ్గు బైటబెట్టి
ఎందరెందరో నానోట నెంగి లుమియ
కష్టమనకను మ్రింగితి నిష్టమనుచు
మిగిలినవి చెప్పగారాదు మేనువణకు.

ఛీ: ఛీ! యీజన్మ మెందులకునుపనికిరానిది. కష్టసుఖము లిప్పుడునాకు గొంచెము తెలియుచున్నవిగాని, యింతకుముందుమాతల్లిమా టలువివి

గీ. అంగయష్టిని సంతలో నమ్మజూపి
కొనుడు కొనుడహో యని నేను కూకలిడితి
విటులు బసచేయు చావడి వేశ్య యనగ
చేయిబట్టుకు లాగితి చెనటినగుచు.

ఈసంగతి తలచుకొన్న నాలో నాకే హీనముగానున్నది కానిమ్ము. అన్నిటికిని ఆ శ్రీకృష్ణభగవానునిదే భారము.

(తెరలో) అమ్మాయీ!

కామ.—అదిగో! మాతల్లి వచ్చుచున్నది. (తలదువ్వుకొనుచుండును)

(నరహరి ప్రవేశించి)

నర.—ఏమే! యింకను సింగారింపుకాలేదా?

కామ.—కావలదా?

నర.—చీరసింగారించునప్పటికి యీూరు మాటుమడగవలెనుగాబోలును

కామ.—అమ్మా! ఎందులకేసాదింపు?

నర.—ఎందులకా నీతోడివారందరును గంటకుముందే ముస్తాబై తల వాకిట నిలచుండిరి. నీకింకను, తెమలనేలేదు. ఇంకొకయరగం టలో నెవరిదారిని వారు బోదురుగదా, పిదత నీసింగారింపు నావద్దజూపింతువా?

కామ—అమ్మా పీథిలో నిలుచుండుటచేతనే సరసులు వత్తురనియా నీయుద్దేశ్యము?

నర—ఓసివెర్రిముండా యిదియా నీయూహవిను.

గీ. పల్లెటూరైన నీమాట పాటియగును
పట్టణంబుల కేవేళ పనులమీద
నెన్నిరకములు వత్తురు వన్నెకాండ్రు
యేమిడుత యెపుడు బడునో యెవ్వరెరుగు?

తెలిసినదా? జాలరివాడు రోజంతయు వలవేసిన యెప్పుడో యొకప్పుడు కడుపునిండిన చేపబడునుగాని, ప్రతివలకును వలనిండుగా చేపలుబడిన, వాడు మోయలేకను, మనము తినలేకను జత్తుము. ఇటువంటి కుశంకలు మానుము. మనది గాలివిసురు.

కామ—అమ్మా! ఇంతచదువెందులకు.మనకుప్రాప్తమున్నదిరాదా.

నర—అబ్బా! యేమివైరాగ్యమే? అట్లయిన ముసుగుపెట్టుకొనిపండుకో. నోటివద్దకు బువ్వవచ్చును.

కామ—అమ్మా! నీకెంతకోపమే. మాట్లాడితె ముక్కుమీదనేయుండును. కాని, నీవు వయసులో నిట్లే కడపలో కూర్చుండెడిదానవా?

నర—కూర్చుంటివాయని యడుగుచుంటివా?

క. తలకింత మెరుగు బెట్టుచు
చిలుకలపావడను గట్టి సిగ్గనకుండన్
తలవాకిట నిలుచుంటిని
కలికీ! సరసుండు లోన కాలిడుదాకన్.

ఆవచ్చినవారలను వినయముగా లోన బ్రవేశపెట్టి—

గీ. ఇష్టమున్నను లేకున్న కష్టమనక
పైకి ప్రేమను జూపించి ప్రక్కజేరి

ధనమనంబులు హరియించి తలనుఁగొరిగి
సాగనంపితి విటుల నాచమకుజూపి.

అంతియేగాని, నీవలె తెగసాఁగుళ్ళు మాకు లేవు. ఇట్లయినఆకాలములో నొక్కరాగిడబ్బు సంపాదించగలమా?

కామ—అమ్మా! ఆకాలమునకు ఈకాలమునకు తేడాయున్నదా?

నర—ఆలోకమునకు నీలోకమునకు నెంత తేడాయున్నదో యాకాలమునకు నీకాలమునకు నంత బేధమున్నది.

కామ—అమ్మా! యేమిటి యాబేధము?

నర—చెప్పెద వినుము. ఇప్పటి యొక రాగిడబ్బు ఆనాడొక రూపాయగా నుండెడిది. సరసులెవ్వరైన సానుల కొక్కరూప్యమిచ్చినయెడల గొప్పయిూవియే. ఇప్పుడో వందలు వేలిచ్చినను చులకనయే. నాకాలపుసరసులు—

సీ. సానులయిండ్లకు సరసు లేతెంతురా
చాటుమాటుగ వచ్చి సాగువారు
వేడుక కెవ రేని వేశ్యలనుంచిరా
తమప్రాణములరీతి దలచువారు
చీటికి మాటికి చీకాకుబడకుండ
కోరినఁగలదంత కూర్చువారు
సానిని గనిపెట్టి సర్వదా మసలక
నెప్పుడో యొకరోజు నేగువారు

గీ. ఎవరు మనయిండ్లకొచ్చిన నేమి యనక
ధర్మమూర్తులఁ బోలుచుఁ దనరువారు
అట్టివారల నెంతయో నడలఁబెట్టి
యమితధనమును లాగితి నాశజూపి.

కామ—అందుచేతనేకాబోలు! మనయింట బండుకొనుటకు నొక్క మంచమైనను లేకబోయెను.

నర—ఇదియా నీయాసడింపు. ఎంతకండ్లు నెత్తికెక్కి మాట్లాడుచుంటివే. అటువంటిరోజులలోనే యట్లు జేసితిని. యిప్పుడైనచో ఆహాహా! ఏమిసరసులే, యేమిధనమే, యేమిసగలే చూడము చ్చటగుచున్నది. ఇట్టి మహాసంపదల కాలవాలమగు కాలమందే నీవు ధనముగడించలేకున్న మరొకప్పుడు గడింతువనుటకల్ల.

కామ—అమ్మా! యీరోజులకన్న మునుపటిరోజులే మంచివి.

నర—ఎందుచేత?

కామ—ఎందుచేతనన, నీవయసుకాలములో నెవఁడో యొకఁడు మిమ్ములను చేబట్టి భార్యవలె ప్రేమించుచు, కష్టసుఖములందు పాల్గొనుచు యెప్పుడోవచ్చి పరామర్శించుచు యభీష్టంబులిచ్చి, మీకు విసుగుగలిగింపక, వెడలుచుండెడివాఁడు. మీరో ఉంచుకున్నాతని భీతిలేక, స్వేచ్ఛతో మెలఁగుచుండెడివారు. మీపాలిపకులున్న మడిమాన్యములులలిగి, మీకుడాలుకావు వలె నుండెడివారు. ఇప్పటిసరసులనుజూచి నీవు మురియుసక్కరలేదు. ఘరానాసరసుల జెప్పెద నాలకింపుము

సీ. కూలినాలిని జేసి కోటాండు గుట్టించి
గోటుగా వచ్చెడి కూలియొకఁడు
దారులగొట్టుచు ద్రివ్యంబునార్జించి
షోకుగా వచ్చెడి చోరుఁడొకఁడు
గరిటులద్రిప్పుచు కాసంత గడియించి
వడివడి వచ్చెడు వంటలయ్య
తనగిత్త పస్తున్న తగని బడాయితో
పైకంబు గొనివచ్చు బండివాడు

గీ. చాకి మంగలి షాకులె చాలబలిసె
నీదునాటనుబోలిన నిర్మలుండు
లేడు యిక్కాలమందున లేడులేడు
అందుచేతను వెక్కసం బయ్యె తల్లి!

వీర లే రెండుపూకలిత్తురో లేదోగాని కొనిపడవేసినట్లు సొంతభార్య లాగున సరసాలు. డొక్కచించినా అక్షరము లేదు. ఎచటివియో నాలుగెంగిలిముక్కలు తెచ్చి యిచటకూతురు. తాగునది అర్థ జాక టైనను, అర్థరూపాయి సారాతాగినంత, హంగమా జేతురు. ఇటువంటివారలకు, ప్రియయన నేమి తెలుసును? మంచి చెడ్డలు మొదటనే పూజ్యముగదా! నీకనుభవము లేకపోవుట చేత, అరచేతిలో వైకుంఠమమరినట్లు, సంతసించుచుంటివిగాని నేనీనిర్భాగ్యులతో బడెడియాతన యమయాతన. మొన్నటిదిన మే తెంచిన తాగుబోతుపీనుగ బొళ్లుబొళ్ళున, నామీదనే క్రక్కినాడు. అబ్బా! (యొడలుజలపరించుచు) ఆవాసన వదలింటకుగాను, మూడుసబ్బుబిళ్ళలు, యొకసెంటుబుడ్డి ఖర్చుపడినవి. సంపాదన రూపాయి, ఖర్చు రెండు. అమ్మా! వినుచుంటివా?

నర—ఓసినిర్భాగ్యురాలా!, ఒకయేడు పైబడుచున్నదాలదిని, తెలివితేటలు నశించుచున్నవే మే!

గీ. వేయునేటికి కూతురా విను తెలిపెద
ఎవ్వరేమన్న వినకిక నవ్వుచుండి
మోహసంద్రంబులో వల ముంచివేసి
ధనము గుంజిన సానియే ధన్యురాలు.

ఇందున్న రహస్యమిది. ఇంక నీయిష్టము. చెప్పవలసినది చెప్పితిని.

కామ—అమ్మా! నీవుచెప్పినదంతయు యథార్థమేగాని, నవమాసములు

మోసి, కని, పెంచి, పెద్దదానిని జేసి, విద్యాబుద్ధులుచెప్పించి పరమఛండాల నిర్భాగ్యదామోదరులతో, గూడుమనుట కేనా? యిది నీకు న్యాయమా? లేతగులాబిపూవును కోరిందకంపపై బారవేయజూతువా తల్లీ!

నర—అమ్మాయీ! నీకు విద్యచెప్పించినందులకు ఫలమాయేమి? నీ తెలివి తేటలన్నియు నావద్దనే జూపించుచుంటివి? ఇన్ని యేండ్లు వచ్చినను నీకు—జ్ఞానము రాకున్న, నేనెంతకని యేడ్తునే. నీవు చెప్పెడిమాటలు నాకేమియు తలకెక్కుట లేదు. నీపైన నాకు విరోధమా? నిన్ను బాధచేయుట నాకు సంతసమా? నీవును, యేవో నాలుగుసుగుల్లలు చేయించుకొని నలుగురితో బాటు చిలో పాలోయనుచుండిన చూచి సంతోషింపదలచినదానిని' నిన్ను కోరిందకంపపై పారవేయజూతునా? మనయిండ్లకువచ్చువారు పరమఛండాలురా! ఎంతమాట! మహాపవిత్రమైన గంగాభవాని, యెన్ని యెన్నికల్మషములను భరించుట లేదు? ఎందరెందరి పాపములు తనలో మునిగినతోడనే భస్మపటలము గావించుట లేదు. యీపాపములుగాని, ఆకల్మషములుగాని, యామెనంటినవా? అటులనే నీవు నొక్కివక్కాణించితివే ఆపరమఛండాల నిర్భాగ్య దౌర్భాగ్య, అభాగ్య, సప్తకట్లవాజమ్మల కాయశుద్ధిచేయుటకును కామపీడ పరిహరించుటకును. వేశ్యలు జన్మించిరి. మనమే వారిని శుద్ధిజేయవలయును. మనగృహంబులకు వారు రానియెడల, వారలకు గతులే లేవు. ఆగంగాభవాని యటు, మనమిటు, తెలిసినదా? మరొక్కమాట. ఆగంగలో బుటుకు బుటుకుమని, మునిగిపోవువారేగాని, మనలను దర్శించువారు మనకు మంత్రపుష్పమునహా చెల్లించుచుండిరి. అటుల చెల్లించనివాడు మగ్గూర్.

కామ—అమ్మా! గంగాపుత్రిలని చెప్పుదు రే, వా రేనా?

నర—గంగాపుత్రిలనగా, గంగవద్ద నీరుకాసులబట్టువారు. వారిసంపాదనతో పాటు వారును మనపాదాకాంతులే.

కామ—అమ్మా! నాయొంటిమీద యీమచ్చలేమిటే?

నర—(చూచి) ఇవియా చిడుముమచ్చలే.

కామ—కాదే, మొన్న సాహేబు వచ్చివెళ్ళినదిమొదలు యివి లేచినవే!

నర—లేనిపోనివి దెచ్చిపెట్టుకొనకు. అనుమానము పెనుభూతము. ఎందుకైనను మంచిది.

గీ. నాగదొండయు నల్లేరు నానబెట్టి
పచ్చిపసపుతో మర్దించి పసరుదీసి
సంజవేళను బట్టించి స్నానమాడ
తుప్పరాలిన విధమునఁ దుల్లిపోవు.

కామ—అమ్మా! యివియన్నియు నెచ్చట నేర్చికొంటివే?

నర—దీనికేమిగాని యిప్పటి సరసులకున్న యావ, స్వేచ్ఛ, ధనము నావయసుకాలములోనున్నను, అప్పటివయసే నాకిప్పుడున్నను, యింక వేరె యడుగవలయునా?

కామ—ఉండునెడల

నర—ఉండినపక్షమున, నింక చెప్పవలసినదేమున్నది? వినుము—

సీ. రాజాధిరాజుల రథములు సతతంబు
గుమ్మంబుచెంగట గూడకున్నె
యింగ్లండు దొరవార్ల యింగ్లీషుమోటార్లు
నీటుగా వాకిట నిలువకున్నె
పండితప్రముఖుల పాలకీలేవేళ
పంచాదిమూలలు బట్టకున్నె

కలకజే ర్నునిసీబు కరణాల బగ్గీలు
దొడ్డివాకిటబడి దొరలకున్నె
జూదర్లు రౌడీలు జోహారు లొనరించి
కావలి నాయింట గాయకున్నె
గీ. వచ్చువారలకెల్లను వాయిదాలు
చెప్పి పలుసార్లు త్రిప్పుచు చివరకెపుడొ
ముద్దుముద్దుగ వారితో ముచ్చటించి
నరహరి! నరహరేయన నచ్చజెప్పి
వెడలగొట్టనె చిప్పచే బెట్టి కడకు.

ఎంతయోజించిన నేమిలాభము. సింహముకడుపున కుక్కపిల్ల బుట్టి నట్లు నీవు నాకడుపున బుట్టితివి, ఇప్పుడైనను నేజెప్పినట్లు చేసితి వేని నిన్ను బంగారపురామచిలుకను జేయనా?

కామ—ఎట్లు చేయవలెను?

నర—ఇట్లు,

సీ. తినుబండములకంచు నను వైనబొందిలీ
నొకనిని సరసుగా నుంచవలయు
బట్టలవర్తకు నెట్టులో పడగొట్టి
విటునిగా నేవేళ బెట్టవలయు
నగలనుజేయంగ వగలను జూపించి
కంసాలిమగనిని క్రాగవలయు
రొక్కంబు నార్జించ చిక్కని శెట్టిని
మగనిగా జేపట్టి మసలవలయు
గీ. కల్లు, చేపను, మాంసంబు, కాయగూర
లమ్మువారలు వచ్చిన యాకులిచ్చి
మళ్లిరమ్మంచు కనుగీటి మాటలాడి
జీవనము జేయ బంగారు చిలుకగావె?

కామ—(తనలో) ఔరా! మాతల్లిమాటలు, వినినకొలది నాప్రాణము గడగడలాడుచున్నది. (ప్రకాశముగా) అమ్మా! ఇన్ని తెలివితేటలుండియు ఇంతమంది సరసుల చేబట్టియు నీచేతులకు గాజుపెంకులైనను లేకబోయెనేమే?

నర—ఆనా డీపాటిసరసులు, ధనము లేదని నీకెన్నిసార్లు చెప్పను! అయినను యిప్పుడుమాత్రము మానితినా?

కామ—అవును! అడుగుట మరచిపోతిని, నాన్నగారు నెలకు యేమి యిచ్చుచున్నారే?

నర—ఎదో, ఆయనకు తోచినది, నాకు నల్లమందుఖర్చు.

కామ—అమ్మా! కాఫీసహా మనయింటనే యారగింపుచేయుచుండ, నేదో నల్లమందుఖర్చుకు నీకిచ్చుచుంటిరని చెప్పదవేమే?

నర—అమ్మాయీ! నీకు తెలియని దేమున్నది. ఆయనయు ముసలివాడు. నావలెనే కాటికి కాళ్ళుసాచుకుని యున్నాడు. ఏదో చూచియు చూడనట్లు పోవలెనుగాని,—

కామ—అమ్మా! నేనంటినని కోపమువలదు. ముసలిదానకు నీకే యింత యభిమానముండ పడుచుపిల్లలము—

నర—అమ్మాయీ! యీవిషయమై రాద్ధాంతము చేయనక్కర లేదు. పంపించివేయుదునులే.

కామ—అమ్మా! మాటవరుసకంటినని చెప్పలేదటే. నీకు కష్టమొదవిన నాకుగాదా? యీనాన్న, ఎన్నవనాన్నే?

నర—(కోపముతో) లక్షాధికారైనట్లు పలుకకుండు. ఇంతే, యింట్లో ముగ్గులుపెట్టుమంటే నిన్ను మీరువారు లేరు. ముసలిదానితోడనే వసంతములాట?

కామ—(నవ్వుచు) అమ్మా! వేళాకోళమున కంటినే. దీనికేమిగాని, సరసులు చెప్పినట్లువినుటకు మందులున్నవనుదానవు. ఏవవి?

నర—మన నేమందు. అంతకన్న నేమి?

కామ—చెప్పవే?

నర—నీకెందులకే. శుభ్రమైనపిల్లవు. ఎవళ్లో కసుగాయలుగాని మం దులుమాకులు. నీవద్దకు వచ్చినయాతఁడు, నీకు పసుపుగుట్టి పొమ్మనువరకు నిన్ను వదలనేవదలడు. పోట్లగొట్టునలె నీవు చేరనియ్యవుగాని, యింకా మందులెందుకు. నీమొగము?

కామ—అబ్బా! చదువుమొదలిడిన కొండపీటి చాదతొళ్లిపులాగున తరుగనియ్యవు. అమం దేదియో చెప్పుము?

నర—వెర్రిముండ! విను.

గీ. తలుపు కిట్టును సంధించి తద్దినాడు
దోమకాటుతోకలనూరి వాము జేర్చి
విడెములోబెట్టి జంకక వీలుపగిది
తులము మ్రింగింప నేలాటి తుంటరియును
కుక్కవలెనుండు మనయింట గిగుర్రసక.

విటావళి కన్నులుగుట్ట హృదయంబులు దడదడలాడించు, గూఢుగే ఖలుగలిగి యుక్తవయసులోనుండియు అద్దాలలో బిడ్డపగిది ముద్దులు గుడుచుచుందువు. నీవు ముందేలాగున బ్రదుకుదువో తెలియకున్నది. నాఘటముండగా నాలుగుసంగతులు నేర్పుదామన్న నన్ను జూచినతోడనే రుసరుస లాడుచుందువు. ఏమిచేయుదును? నీకర్మము నీది!

కామ—అమ్మా! నీవనవలసియందువుగాని నీవుచెప్పిన దేది నేవినుటలేదు

నర—విన కేమి! మాటలుమాత్రము తేనెలొలుకునట్లు మాటాడి నావద్ద నక్కవినయములు జూపుచుందువు. ఈనక్కవినయములు యీ తేనెమాటలు యేసరసునొద్ద జూపించిన నీకు పాదాక్రాంతుడు గానేరడు? నిన్నుగురించి నేనింత కొట్టుకొనవలసిన యవసరముండునా?

కామ—అమ్మా! చీటికినిమాటికిని గసరక చెప్పవలసిన దేదేనియు న్న నొకసారి చెప్పుము. సావధానముగా వినెద.

నర—నేనాగుట నానోరునొప్పికేగాని, వినుటాపనుటా! కానిమ్ము. మనము వెలకాంతలము. తెలిసినదా? అందుచే,

క. రొక్కంబె మగఁడు మనకగు
నిక్కము మదిలోఁ దలంచ నీరజనేత్రా!
చక్కదన మెంచకుండగ
వెక్కసపడకుండ గూడవే విటకోటిన్.

కామ—(చెవులుమూసికొని తనలో) కృష్ణ! కృష్ణ! ఎంతటి పరమార్థసంగతులు నాతల్లి నాకు బోధించుచున్నది. (ప్రకాశముగా) అమ్మా! వార్ధక్యము ముదిరినకొలదిని, మతి పోవుచున్నదా యేమి?

నర—నాకు మతిపోవుట లేదుగాని, నీకు కండ్లునెత్తికెక్కుచున్నవి.

కామ—చాలు! నీనీతిబోధనాకౌశలత్వ మీపాటికి గట్టిపెట్టు.

నర—అగునే! నేనన్నను, నామాటలన్నను నీకు మంటయని నేనెరుగనా? నేనుడివినదానివల్ల నిహపరసాధనములు రెండును గల్గునని నాయూహ.

కామ—(తనలో) నల్లశిలలు వెన్నగుటికలగునాఁడే యీపాడుజాతికి యిహపరసాధనములు గల్గుట. (ప్రకాశముగ) అమ్మా! అదెట్లు?

నర—ఎట్లా! "పరోపకారార్థ మిదంశరీరం" అను నార్యోక్తినిబట్టియొకరికి మన మానప్రాణంబులు ధారవోసి వారలసంతుష్టి జేయుటవల్ల పరమును, వారలిచ్చిన ధనమువల్ల యిహమును దక్కునుగదా. ఇదిగాక మరొకవిశేషముగూడ నున్నది.

4

కామ—ఆవిశేష మేమిటి? (సాగదీయుచు పల్కును.)

నర—అమ్మాయీ! సాగదీయనక్కరలేదు. ప్రపంచసృష్టితోబాటు మనకులమును బుట్టినదిగాని నిన్న మొన్న బుట్టినదిగాదు. నీవంటి చచ్చుపెద్దమ్మలు యీకులమునందుద్భవించుటంజేసి యింతతారుమారైనది. వేశ్యలన్న ఇదివర కెంత గౌరవముండెడిది? అయినను యిప్పటికిని కొన్ని పూర్వాచారములు జరుగుచునే యున్నవి.

కామ—ఏవవి?

నర—హిందూగృహస్థులు వివాహకాలమున ముందుగ నల్లపూసలు దెచ్చి మనచేత కుత్తికంటు గ్రుచ్చింతురు. ఎందుచేత? మనము నిత్యపుణ్యస్త్రీల మగుటవల్ల. ఆపెండ్లి కుమార్తెయు సర్వదా పుణ్యస్త్రీగ నుండవలయునని వారికోరిక. ఇదంతయు హిందూమతముమాట సుమా నేజెప్పినది. విడోమ్యారేజి మాటగాదు. అతంతువేరు.

కామ—ఆగొడవ మనకెందులకు గాని కుత్తికంటు గ్రుచ్చించుట మొదలగు వారియాచారములు వారు సరిగనే నిర్వర్తించుచుండిరి. మనజాతి మాత్రము పూర్వనిబంధనలను బాడుచేసి ధనమే ప్రధానముగాగొనుటచే మనగౌరవములు మంటగలసినవి.

నర—అమ్మాయీ! బ్రతుకుదెరువు చూచుకో. తోడివారలనుజూచి నేర్చుకో. నీవొక్కదానివల్లను భూమికిపడినచిల్లి పూడ్చనేరదు. నలుగురుతోపాటు నారాయణా! కులముతోబాటు గోవిందా! యింక గప్‌చిప్.

కామ—అమ్మా! శ్రీకృష్ణభగవానుని పటమునొద్ద దీపారాధనచేసి వచ్చెదను. (నిష్క్రమించును.)

నర__దీనిపూజలు, దీనిమాటలు, వైరాగ్యము, జూడ నాకు లొంగు నట్లు దోచుటలేదు. అందుచేతనే, ముందుగతికి నాలోచించి, ఏపిల్లనైనను తీసికొనిరమ్మని, మాకురరిసుంకను బంపినాను గదా. యీసంగతిమాత్రము, మాకామకు తెలియకుండ నేర్పాటుచేయవలెను.

కామ__(పరివేశించి కూర్చుండును)

(వెంకప్ప పరివేశించును)

వెంక__ క॥ అక్కా! తెచ్చితి చేరము
చక్కనిచుక్కంచు నీవు సంతోషిల్లన్
నర__ ఎక్కడ నున్నదిరా యది
మక్కువ మీరంగ జూపు మా, కనుగొందుణ్.

కామ__వెంకప్పా! యేమిటిరా?

నర__చెప్పదనులేవే__

వెంక__అమ్మా! రూపాయిచ్చెదనంటివి. ఇమ్మ!

నర__ఇచ్చెదనులే, యిటుతీసికొనిరమ్మ.

కామ__అమ్మా! ఏమిటాగొడవ?

నర__చూస్తూవూరకుండుము అన్నియు తెలియగలవు.

వెంక__(మెల్లగా) అమ్మా! వాండ్రితో నే నేమియు చెప్పలేదు మనయింటివద్ద పనియున్నదని, చెప్పి తీసుకువచ్చితిని. తల్లియు కూతురు వచ్చినారు. పిల్లపెద్దదేనే, యిచటికి తీసికొనివత్తును చూడు. వచ్చినపిమ్మట మెల్లగా, కదుపు. (నిష్క్రమించును)

కామ__అమ్మా! ఏమారహాస్యములు?

నర__ఎవరోపిల్లటే, పాపము బీదవాళ్ళట! పదమూడు పదునాలుగు వత్సరములు వయసుండు నట! ఏదో కిఫాయతుగావచ్చిన పుచ్చుకుని పెంచుదామని తీసుకరమ్మంటిని.

కామ—(తనలో) శ్రీకృష్ణా! వీరికృత్యము లడుగంటదొ్రక్కక, వృద్ధిబొందించుట న్యాయమా? లేక నీకు పరమానందమా? నీవే యిటు లుపేక్ష జేసిన విశ్వమంతయు వ్యభిచారములో మునిగిపోయి దుండగములు పెచ్చుపెరిగి ధర్మమునశించిపోదా? (ప్రకాశముగా) ఛీ ఛీ! మనకెందులకే బిడ్డా పాపా లేనివాళ్లకుగాని. నేను నీకింత బువ్వ పెట్టనేరనా? యేగోచిపాతముండనో గాని దానికి చాకిరి యెవడుచేస్తాడే. దైవము రక్షించి నాకడుపు పండగూడదా! ఇటువంటిపిల్లలను నీవుపెంచిన నీకు నిరువాకము జేతురనుట కల్ల.

నర—(తనలో) ఇప్పుడు తగినమందు వేయకపోయిన నాపాచిక పారదు గావున యిట్లుజెప్పెదను. (పైకి) కామా! మనజాతికిసంతుకలుగు టబద్ధము. అధవా పుట్టెదరనుకొమ్ము—

ఆ. వె. బిడ్డఁగన్న దానిబిగువు సడలిపోయి
కుచములు దిగజాఱి కుమ్ములాడు
నందమన్న యసలె నడుగంటిపోవును
చాల గానుపించు లోలపగిది.

చూడరాదా బిడ్డలనుగని చిలక్కొయ్యలవలె నెట్లుతయారైరో! కానుల బేరములు కానులలోనికి దిగును. అందుచే నెందులకయినను మంచిది. నామాటవిను. నీవు కుఱ్ఱదానవు.

కామ—(తనలో) వ్యభిచారమును మాన్పవలెనని నేబాటుపడుచుండ నాతల్లి వృద్ధిబొందించుటకు బ్రయత్నించుచున్నదే. ఇటులని జూచెదగాక (ప్రకాశముగా) అమ్మా! శరీరపటుత్వముచెడునని సంతుకాసింపనివా రుందురా?

నర—(కామకళగడ్డముపట్టుకొని) నీకు తెలియవే, యిందలిబాధలు నే నెందులకింత కొట్టుకొనుచుంటినో నించుక యోజింపుము.

కామ—(విసుగుతో) నాకేమియు బోధపడుటలేదు. నీసంగతి సందర్భములు జూడ, నాప్రాణము గడగడలాడుచున్నది.

నర—నేనేపని జేసినను, నీమేలుకొరకేగాని, నాకొరకా యేమి. సంగతి యేమన?

గీ. రోగములకాకరంబైన భోగకాంత
గర్భధారణ కలలోన దుర్భరంబు
కాకనిలచిన నయ్యది గండమగును
తల్లిబిడ్డలసందున తప్పకుండ.

ఈయనుమానముచేతనే, నీవేమైపోదువో యని వగచి నీవు పుష్పవతివైన ప్రథమదివసంబుననే నీకీజన్మలో కాన్పు రాకుండునట్లు నీగర్భకోశము యోషధీప్రయోగంబుచే గాల్చివేసితిని. అప్పటితో నాభయము తీరిపోయెను. నీవెప్పటికిని వాడిపోక నిటులనే యుందువు.

కామ—(తనలో) ఓహో! ఏమియద్భుతచర్యలు. ఇట్టిమాటలు వినుటచేతనే పాపముజుట్టుకొనును. కాని యొకందులకు మాత్రము సంతసించుచున్నదాన-ఏమన-నాగర్భంబున జన్మించిన వారలు, కూళలై ప్రపంచమును బాధింపకుండుటయే మహోపకారము (ప్రకాశముగా) అమ్మా! ఆకొనబోయెడు దానిని నాబిడ్డగా పెంతువా?

నర—(తనలో) తెగులుకుదిరినది. (ప్రకాశముగా) ఎట్లనోచూడవచ్చు ఏదియులేకున్న వెంకప్పకు బండ్లిచేయవచ్చు. అదిగో! వారలు వచ్చుచున్నారు. నీవూరకుండుము.

కామ—నాకెందులకు నేనిచటనుండియే వెడలిపోదును. (నిష్క్రమించును.)

(చింపిరితలతో మోకాలుదిగని చినిగి మాసినగుడ్డలు ధరించిన
ముదుసలియు దానికుమార్తెయు వెంకప్పతో ప్రవేశింతురు)

వెం—(తల్లికి సైగజేసి నిష్క్రమించును)

నర—(ముసలిదానిని జూచి) మీరెవరు?

ముస—ఏనాదోళ్ళం.

పిల్ల—(గదియు పటములుజూచి నివ్వెరబడుచుండును)

నర—మీరెచట గాపురముండిరి?

ముస—మాగుడిసినోనే.

నర—నీకు భర్తయుండెనా?

ముస—బత్త్రెలెందుకుంటాయి మాకాడ, బేపిలున్నాయి.

నర—అదికాదు నీమగడు

ముస—మామామా- పోనాడు

నర—మీకు బువ్వయేలాగున?

ముస—ముద్దడుక్కుంటాం.

నర—మీమామ యేమిచేయుచుండెడివాడు?

ముస—మచ్చేట

నర—అనగా?

ముస—అనగా మచ్చేటే.

నర—(పిల్లనుజూచి) పిల్లా! నీపేరెవరు?

పిల్ల—పెంటి-

నర—(ముసలిదానితో) మీబిడ్డను మాకిత్తువా?

ముస—ఓలమ్మో!

నర—మంచిమంచిబట్టలు నగలుయిచ్చెదము. నీబిడ్డ చాలా సౌఖ్యము
పడును. నీకు రూపాయలు, చీరలు యిచ్చెదను.

ముస—ఎన్నిరూపాయలు?

నర___నీవే చెప్పుము.

ముస___నాలుగొరాలు.

నర___అట్లనే యిచ్చెదను. లోపలకుబోయి బువ్వతినుడు.

(ముసలిదియు పిల్ల నిష్క్రమింతురు)

నర___నల్లరూపున పిల్ల బాగుగనేయున్నది. ఎరుపురంగున్నమాత్ర మున కొరికితిందురాయేమి. ముఖమునకు రంగుబూసిన చంద్రబింబమును మీరుండును.

గీ. క్షణములోపల నీబాల సాకి నేను
సరసవిధులును, కిటుకులు జాల నేర్పి
చంద్రవదనను గావించి సానులందు
వేలువందలు లాగింతు విటులనుండి.

(తలయూపుచు లోనికి బోవును)

(తెర వాలును)

ఇది ప్రథమాంకము.



శ్రీపరమేశ్వ రార్పణమస్తు.

# కామకళ

ద్వితీయాంకము.

(ప్రథమరంగము)

పురవీథి.

(సుందరాంగుడు ప్రవేశము)

సీ. పైగోవరంగణా ల్వాలెనుండు బందరు
పట్టాలపై స్వారి బట్టిపట్టి
గుంటూరు గుంటల గోటను మీటించి
నెల్లూరు జాణల నిగ్గుదీసి
బెజవాడ లోటన్ల గిజగిజలాడించి
యేలూరురంగుల నేటగల్పి
రాజమండ్రి రవ్వ లను గవ్వలుగ జేసి
కాకినాడ క్రొకింత కలికమేసి
గీ. కంటబడినట్టి పామును కన్నమందు
బారకుండగ బట్టెడు బండసయ్యు
సంతముండను బోలు వ సంతసేన
మాయలనుబడు టెల్ల వి స్మయముగాదె.

కాని నావద్ద ధనమంతయు, వట్టిపోయినదనియు, నేనింక, జేపననియు దెలిసి నాతోడనుండిన, లాభములేదని, దలంచి మొగముమీదనే తనయింటికి నన్ను రావలదని, చెప్ప లేక, ధనవంతు నెవనినో, చేబట్టి, యాతనితోడనే, యాతనిగ్రామ

ము, మావసంతసేన వెడలినట్లు, కర్ణాకర్ణిగ, వినియుంటిని. కాని యేగ్రామమో ఎవనితోడనో, తెలియరాక, కాలు గాలిన, పిల్లివలె, దిరుగాడుచుండి. ఔరా!

గీ. భక్తియుక్తుల పూజించు భార్యపైన
తప్పులేనిదె కోపంబు తరలివచ్చు
కొట్టి తిట్టుచు నేస్పించు కులటపైన
కోపమేరాదు నదియేమి పాపఫలమొ.

ఇచ్చటనే వేరొకని, నాకండ్లముందర, రప్పించుకొన్న యెడల, నేనేమి, కొంప, గూల్తునోయని, భయముచే, నిటు జేసియుండ వచ్చు. (యోజించి) కాదు కాదు, నాయూహ పొరబాటు. దీనికంతకును, కారకురాలు ముసలిముండ. నేను లేనితరి నేదియో బోధించి యింతపని జరిగించియుండవచ్చు. ఇదియే ముమ్మాటికిని నిశ్చయము. మావసంతసేనకు నాపైన నెంత ప్రేమయో నేనెరుంగనా! నేనన్న పడిజచ్చిపోవునది, నే నొక్కనిముసము గంట బడకున్న నాకొఱకు పరితపించుచు పదేపదే వర్తమానములంపునది. తాను స్వబుద్ధిచే నన్నిట్లు మోసగించినదనుట కల్ల. (ఇంచుక యోజించి)

చ. మదిని విరక్తి దోచెనొకొ? మానసమందున నన్నుజూచి బు
ద్ధి దిరిగిపోయెనో చెలియ దీనములాడగ తల్లిమాటకున్
నెదురును బల్కలే కిటుల నేదరి గానక నన్ను వీడితో
మదవతి జెప్పవే? మనసు మారెనొ మోసము జేసినావొకో.

ఆహా!

క. రతియన నెరుగని వేళల
నతివరొ నను బిల్చి నీవు నాదరమొప్పన్
చతురగతి రతుల దేల్చుచు
సతతము నాతోడ గుల్కు సంగతి మరపా?

అప్పటినుండియు నన్ను ప్రేమించి జారపూరుషులయందు బంధితుని జేసి నేడిట్లు వీడిన నేబ్రతుకగలనా! లలనా !

గీ. బిడ్డలేడ్చిన బెల్లంబు పెట్టుపగిది
చింతలొందెడువేళ నా చెంత జేరి
గబ్బిగుబ్బలు నాచేత గాన్క వెట్టి
నవ్వులనుముంచి మరపించు పువ్వుబోడి
నిన్ను విడనాడి నేరీతి మిన్నకుందు.

నాకంఠమందున బ్రాణముండగా నినువిడతు ననుట కల్ల. సప్తసముద్రంబులు దాటి వోయినను నానిష్కళంక ప్రేమకు సముద్రంబులు మోకాటి బంటయగునుసుమా (యించుక సేపాగి) నేనిట నెంతవిచారించినను ఫలములేదు.. మావసంత సేనయున్న తావు మొదట గనిపెట్టి బిదప కార్యసాధనమునకు గడంగుట కర్తవ్యము. కర్తవ్యమున కేమున్నది. నన్ను జూచినతోడనే నావెంట గుక్కపగిది వెనుకబడి రావలసినదే అటుల రాకున్న బ్రతికి బట్టకట్ట గలదా?

గీ. తెల్లయీశ్వరగనినంత తెలివిదప్పి
తలలు వంచెడి క్రూరంపు త్రాచులట్లు
సానులందరు ననుజూచి జడియుచుండ
నీవు నాకొక లెక్కయే నీరజాక్షి.

తొందరేల కొలది కాలములో నన్ని సంగతులును తేలగలవు. నే నిదే పోయి విచారించెదగాక.

(నిష్క్రమించును).

## ద్వి తీ య రం గ ము.

(తెరలేచుసరికి హేమకళయు, నరహరియు, గూర్చునియుందురు)

నర—అమ్మాయీ తెలిసినదా? మరొకసంగతి. నిన్నెవరైనను నీవు పెంపుడుదానవా యని యడిగినపక్షమున కాననియు మా యమ్మ కన్నదనియు చెప్పుము. ఇటుల చెప్పుటచే నీయందు విటులకు గౌరవము హెచ్చును. పెంపుడుదానవని జెప్పినచో యీసడింతురుసుమా ! జాగ్రత్త !

హేమ—(నవ్వుచు) అమ్మా ! నాకు తెలియదాయేమి? యీవిషయమై నాతో నింతగ చెప్పవలయునా ?

నర—బిడ్డా ! తక్కినవన్నియు నీవు నేర్చికొనియే యుంటివి. కని పెంచిన పెద్దమ్మాయి పెద్దమ్మయేగదా? నీవే నాకింత గంజి పోసెదవని నమ్మికున్నాను.

హేమ—అమ్మా! నీ కేవిచారమును వలదు. నిన్న నే గంటికి రెప్ప వలె గాపాడుచుందును.

నర—నీవట్టిదానవనియే నమ్మియుంటిని. నీవుమాత్రము కామ చెప్పెడి మాటలు వినబోకుసుమా !

హేమ—అమ్మా! అక్కయ్య సంతోషమునుమాని యెల్ల వేళల, నేదియో విచారించుచున్నదానివలె గన్పట్టుచుండునేమే ?

నర—అది నాకర్మము దానికర్మము నీకెందుల కాసంగతి. పోనిమ్మ

(తెరలో కామిసెట్టిగారు వచ్చినారు)

నర—లోపల యెవరో యున్నట్టు అచటనుండియే యరచుచుంటివేమే ? వెంటనే బ్రివేశ పెట్టుము. (హేమకళనుజూచి) పిల్లా ! సెట్టిగారు వచ్చుచున్నారు నీవు లోని కేగుము.

హేమ—(లోనకుఁ బోవును,

సెట్టి—(ప్రవేశించును)

నర—(లేచి కుర్చీనిజూపించి) సెట్టిగారూ దీనిపై దయచేయుడు.

సెట్టి—(ఆసీనుడై) అయితే యెందుకూ కబురంపావు నరారీ!

నర—అప్పటి వర్తమానమున కిప్పుడా యూడిపడుట. ఎట్లయినను దయయుంచి వచ్చినారే.

సెట్టి—ఎవ్వారం ఉక్కిరిబిక్కిరై ఊపిరిసలపకుండావుంటే సావమున్నావాయేంటి? అందులో యీమద్దె మారాగులయ్యగాడిపెళ్ళోటి. సరేకాని కబురంపిం దెందు కేంటి?

నర—ఒకసారి నాతో నొకమాట చెప్పినారు జ్ఞాపకమున్నదా?

సెట్టి—అదేదో నువ్వే జ్ఞాపకంసెయ్యి. నేమర్చిపొయ్యానుకాబోసు

నర—జ్ఞాపకంలేదండీ సెట్టిగారు! ఎచ్చటనైన కన్నెతీకమునకు పిల్లయుండిన చూడమని చెప్పలేదా?

సెట్టి—(సంతోషముతో తలనూపుచు) నరారీ! నేనంటే నీకెంతదయే ఎప్పటిమాటో గ్యాపకముంచుకొన్నావా? మాఅయ్యల్లగాడి గరబాదానానికి ముందు సెప్పేను యీమాట అంతేనా?

నర—ఎప్పుడైతేనేమిలెండు. చెప్పినారుగదా?

సెట్టి—ఇప్పుడేదైనా బేరం తగిలిందాయేంటి?

నర—ఆలాటిదే.

సెట్టి—ఎవరిపిల్లేంటి?

నర—ఎవరిపిల్ల మాకేమికర్మము మాపిల్లయే.

సెట్టి—ఏంటి యీమద్దె యేదో సెత్కారిముండను నరారికొందని వూళ్ళో పుకారు పుట్టింది అదేనాయేంటి. కాక మరోటా?

నర—ఏత్రాగుబోతు లన్నారండి. యీవీధియంతయు మేమన్న కండ్లలో నిప్పులు బోసికొందురు. రుజువివ్వండి మీచెప్పుచేతను

దవడమీాద కొడ్తాను. అన్నా! యీాసంగతి మీావాకబులో నికిసహా వచ్చినదీ?

సెట్టి—నరారీ! మీాపెద్దపిల్ల కామకళ యేది? వూళ్ళోవుందా?

నర—ఉన్నది.

సెట్టి—అయితే నన్ను సూడ్డానికి రాలేదేమి?

నర—కామా! సెట్టిగారు పిలచుచున్నారు. ఒకసారి యిటురమ్మా.

కామ—(ప్రవేశించి నిలుచుండును)

సెట్టి—(చూచి) ఓహో! బొగ్గుల్లో రామసిలుకొచ్చిందే.

కామ—సెట్టిగారూ! దేవుఁడు నన్నిట్లు బుట్టించెను. మీారుమాత్రము హేళనముచేయుట తగదు.

నర—సెట్టిగారు! వేళాకోళముగా సరసమాడితే తప్పా?

సెట్టి—తెల్సింది తెల్సింది. యిది చోకేలీముండావోళ్ళను చూాత్తుంది. నేను సడసమాట్టం నాదేతప్పు. చమించు. చరేనా. నరారీ! మీాయింట్లో పిల్లయెక్కడిది?

నర—నాచిన్నకూాతురండి.

సెట్టి—నీచిన్నకూాతురా?

నర—మీారు మరచిపోతిరి. పదిసంవత్సరములకుక్రితము మీారు దీనిని చిన్ననాటను చూచియుంటిరి.

సెట్టి—యీామద్దె యెక్కడా మళ్ళీసూడలేదు, యేమేళానికిరాలేదు. గోసాలోపెట్టి బూబునుచేసినావాయేంటి?

నర—లేదండి, నాలుగవయేటనే మాఅప్పగారికి పెంపుయిచ్చితిని. అప్పటినుండియు అచటనే బెరుగుచుండెను కాని, యీామధ్య (గుడ్ల నీరుగ్రుక్క కన్ను లద్దుకొనుచుండును).

సెట్టి—నరారీ! యేడుత్తావేంటి. సంగతేదో చరీగాసెప్పు?

నర:—ఏమున్నదండి యీమధ్య మాఅప్ప చనిపోవుటచే తిరుగ నా బిడ్డను తీసుకొనివచ్చితిని.

సెట్టి—ఇంతేగందా, ముసలోళ్ళు సావక బతుకుతారేంటి? మీఅప్ప చచ్చుటచే పిల్లయు, పిల్లికూనయుకూడ వచ్చినవి. కాని యీ పిల్లనే తెలవనియెధవలు కూత్తలు కూసారు.

నర—అంతియేనండి. మీరుగనుక నిజము కనిపెట్టినారు. యేదిక్కుమాలినవాళ్ళు యీవాదు వేసినారోగాని-

సెట్టి—అయితే సూడు. మాటలతోడనే పొద్దోయింది, పిల్లేది?

నర—కన్నెరికపుకట్న మేమిప్పిస్తారు సెలవివ్వండి?

సెట్టి—సరుకుసూడాలమరి, సూడకుండా బేరంయేలాగేంటి, నువ్వే సెప్పుమటి. అయినను యిప్పుడు ధరలు మందం, ఏదో యొకటిస్తాను. నీకూనాకూ బేరంయేంటి? పాతకాతాదారుడను. పిల్లను ముందు సూపించు.

నర—సెట్టిగారూ! వుమ్మడిబేరములు పనికిరావు- వెయ్యినూటపదహార్లు మీవద్ద పుచ్చుకొనితీరుదును. పిల్లను చూపించెదను. చూచి మాట్లాడండి, అమ్మాయీ! (కేకవేసి పిలచును)

హేమ—(ప్రవేశించి సిగ్గునభినయించుచు సైడుప్రక్కజేరి తలవంచి నిలచుండును)

నర—మనసెట్టిగారేనే- వెర్రిపిల్లా! భయములేదు, యిటురమ్మా (సెట్టితో) సెట్టిగారూ! నేనుచెప్పిన గొప్పగునుగాని, యీపిల్ల మాజాతిలో పుట్టవలసినదిగాదు.

హేమ—(తల్లిని జేరి నిలుచుండును)

సెట్టి—సూత్తే ఆలాగేవుంది.

నర—చిన్నసప్పటినుండియు నతిగారాబమున పెంచినారము. ఎట్లు కాపాడెదరో, మీయదియే భారము.

సెట్టి—(తనలో)

క. సక్కని సుక్కను బోలిన
సక్కెరబొమ్మవోలెనుండె చింతచమయ్యెన్
నిక్కము నరారి. మాటలు
సిక్కములో సిలుకబోలి సిక్కెను నానున్.

మంచి దేగుంట—

నర— సెట్టిగారూ! ఏమిటి యాలోచించుచున్నారు?

సెట్టి.—యేయీ లేదు. పిల్లను సూడగానే, మూర్చొచ్చింది. తెవులు కుంటున్నాను. అంతే.

నర—వేళాకోళమాడుచుంటిరా, నాతోడనే?

సెట్టి—అబ్బె, అత్తా! అమ్మతోడు, ఎంతమాట?

నర—చిత్తము, సెట్టిగారూ! మీరు నమ్మండి, నమ్మకపోండు

క. మీపేరు విన్నదాదిగ
మాపట్టియు మిమ్ముగూర్చి మానసమందున్
దాపక వాకొనుచుంటిని
రేపవ లొకటే విధాన ప్రేమలుగులుకన్.

సెట్టి—అయితే నాపేరు దీనికి సెప్పరాయేంటి?

నర—సరిసరి మాపిల్ల పెద్దమనిషి అయినది మొదలు మీచేతనేకన్నె జేకము చేయించవలెనని నేనును మాకామయ్యయు పలుసార్లు ముచ్చటించుకొనుచుండగా వినదాయేమి? అసలు మాయుద్దేశ్యము వినండి సెట్టిగారూ.

క. కోమటిబోణీ కోరుట
చే మాసుత మీకడ దలచితిమో సెట్టీ
నామెను గూడను మదిలో
మీమీదనె వలపుగుదిరె మీతోడుసుడీ.

బోణీ మీచేత గొట్టించవలెనని మాతలంపు.

సెట్టి—ఎట్టిమొగంలాగున్నావు అయితే, నొద్దన్నానాయేంటు. అలా నేకానియ్యి. ఎంతబాగ్గవేంటి సచ్చుముండాపని. కాని,బోణీ, బోణీ, అంటున్నావు. నా దేనేటి బోణీ.

నర—ఏమట్లడుగుచుంటిరి?

సెట్టి—మరేవీలేదు. యిదివరకు సాటుగా మాటుగా బోణీఅయిం దేమో యని, అన్నాను.

నర—రామరామ! చాలునండి. మీమాటలు. పిల్లనుజూచిన, తెలియదా యేమి?

సెట్టి—పిల్లనుజూచిన, పిడుగులాగేవుంది. నాటుబేరాలు జరిగినట్టుగా మీయిళ్ళ జరిగే, మామూలెగెందా?

నర—ఏమండోయి సెట్టిగారూ! మాయంతమేము, కబురుపంపుట చేత, మీకట్టులే దోచును. వర్తమానించవద్దు, చులకనగా, వుంటుందంటే వినక, మాపెద్దమ్మాయి, కోమటిబోణీ, కోమటిబోణీ అని కొట్టుకొంది.

సెట్టి—పోనీలే, కోప్పడకు. జరితేమాత్తరం, తప్పాయేంటి. యీ మాత్తరంలో, నట్టవేంటి అంతేనా?

నర—సెట్టిగారూ మీకు యిష్టముంటే, కార్యము జరిగించండి; లేకున్న మానండి అంతియేగాని, యిటువంటిమాటలు, మా యింట, పనికిరావు.

సెట్టి—(గడియారముచూచి) అబ్బో! సాలారేతిరయిందే! మాపెద్దో డింటే, నాపనైందన్నమాటే. ఆడికీలాటి యెవారాలు పనికి రావు. నరారీ, సూడు. సప్పుసప్పున బైరం సొసాయించు. కుదిరిందంటే సెలామణి, సేసుకుంటాను.

నర—పోనీలెండు, మీకుబుద్ధిలేకపోయినను, మీ అబ్బాయికైనను యుంది.

సెట్టి—ఏంటో, నీలాగేవుంచాయేంటి, నీపెద్దకూతురు. సూశావు, యేలాటిదెబ్బ కొట్టానో.

నర—మీ రెక్కడండి, సరసమంతా వడపోసినవారు. సరే వెయ్యి న్నూటపదహార్లు, యిప్పించండి.

సెట్టి—ఎయ్యిలేదు, నూరులేదు. ఆపైపదారురూపాయిలిత్తాను. కావాలంటే? సూసుకోమరి.

నర—చాలుచాలు, కూరగాయలబేర మనుకున్నా రాయేమి?

సెట్టి—కూరగాయలంత, సెడిపోయినవా యేమి? వీసె. దుగ్గానికిచ్చు వంకాయలు, యిప్పుడు పావలా,అవియూ, పుచ్చొంకాయలే. అరణా, కూలిత్తే, గంపతోసహా, పిల్లొత్తుంది. తెల్సిందా?

నర—యీమాటకేమిలెండు. ఏదోవిధముగా, కుదిర్చెదరా లేదా?

సెట్టి—నరారీ! నీకు తెలవనిదేముంది. మొదటనే పిల్లికి, యేశిపాలో సిన, మరి, దగ్గిరసేరుతుందా, భాగా ఆలోసించు.

నర—సరే, నూటపదహార్లు యివ్వండి.

సెట్టి—యింకా, యెచ్చే.

నర—యిదియును హెచ్చా! కన్నెరికమునకు, యీమాత్రమైన, యివ్వకున్న, వీలులేదండి.

సెట్టి—నేనోమాట సెప్తాను యిను, యాభైరూపాయిలిత్తాను, కావలిస్తే సూడుమరి, యివిగో (నోట్లు జేబునుంచితీసి జూపించును.)

నర—(పుచ్చుకుని) ఎంతగట్టివారండి.కొంగున కాసుమాత్రము కట్టకతప్పదు. మీయందు మాకున్న ప్రేమచే, యింతతక్కువకు వప్పుకున్నాము. యీసంగతి ఎవరికిమాత్రము తెలుపవలదు. మీదగ్గాకు లోటుగలుగునునుమా!

సెట్టి—చరేకాని, ఏంటి! అరకాసా?

నర—యిస్పేటాసులేదు, అరకాసునుగాము, బంగారపుకాసు.

సెట్టి—యింతేగదా, కాసు కాతాలో రాసుకో యింటికెల్లగానే పంపుతాను.

నర.—మీరు మేడపైగదిలోనికి వెళ్ళండి.

సెట్టి—నేనెడతానుగాని, సప్పున తెవ్వుల్చు-(లేచి) పైలాబోణీ, పంచకళ్యాణి, నీచేతిబోణీ, నిత్యకళ్యాణీ (అనుచు లోనకు నిష్క్రమించును)

నర.—కామా! నీవు వీధితలుపులు బంధించిపండుకొనుము.

కామ.—(నిష్క్రమించును).

(హేమకళను వెంటదీసికొని నరహరియు నిష్క్రమించుచు)

(తెరవాలును)

---

## తృతీయరంగము.

### పురవీధి.

(సుందరరావును, కామిసెట్టియు చెరియొకవైపునుండి ప్రవేశము)

సుంద—ఓహో! కామిసెట్టీ!

సెట్టి—ఓహో! పంతులుగారా యీ మద్దె వూళ్ళోలేరాయేమి?

సుంద.—ఏమట్లడుగుచుంటివి?

సెట్టి—యేమీలేదు. వచంతసేనతో, మీరుగూడ వెళ్ళినారేమోయని

సుంద.—ఆపాడుముండ, యెచటికోబోయిన, దానితోపాటునేనేగవనా?

సెట్టి—పంతులుగారూ, అంతకోపముగా మాట్లాడుచున్నారేమి ఏదైనను జరిగిందాయేమి?

సుంద.—(తనలో) అంతయుదెలిసియే యిట్లు మాట్లాడుచున్నాడు (పైకి) ఏమియు జరుగలేదు. నాకు యిష్టములేక, గెంటివేసితిని అందుపైన, నీగ్రామములో యున్న, యేమిజరుగునోయనిభయపడి, దేశాంతరము బోయినదట.

సెట్టి—(తనలో) యితగాడికే తన్ని తగిలేసిందట. నాదగ్గిర కోతలు కోస్తున్నాడు (పైకి)ఎంతపని జరిగిందండి,పాపముమంచిముండ

సుంద—పాపమూ దానినింతింత ముక్కలుగ, గోసినను, పాపముం డదు. దానికేమిగాని, నాఫలపరిదాన మేదోయి ?

సెట్టి—(బెదరుచు తనలో) రేతిరిసంగ తీయనకు తెలిసిందాయేమి ? అయినను, డబాయించెదగాక (పైకి) బలపరిదాన మేమిటండి ?

సుంద—నావద్ద దాచుచుంటివా ?

సెట్టి—రామరామ! నే నెరగనండి అబద్ద మెందు కేంటి

సుంద—(తనలో) వీడబద్ధమే జీవనముగా గడపును, కన్నులెఱ్ఱజేసి మాటాడినగాని, నిజము చెప్పడు. (గంభీరముగా, పైకి) నీవె రుగవా ?

సెట్టి—తెలిస్తే చెప్పనామరి. మీతోడు. నాకు తెలవదు.

సుంద—నేనుచెప్పనా ?

సెట్టి—అబ్బెంతరమేల (దిక్కులుచూచును)

సుంద—దిక్కులు చూచుచుంటిలేల ?

సెట్టి—(తనలో) యితగాడి ధోరణిచూస్తే తన్నేలాగుంది (పైకి) అబ్బే, ఒంటేలుకోసం.

సుంద—వెళ్ళవచ్చునుగాని, రాత్రి, కన్నెరికమునకు, ఖర్చెంత ?

సెట్టి—(తొందరతో) ఆగం డాగండి. గట్టిగా మాట్లాడిన, యెవరైనా యింటారు. ఇదా మీరడిగిన సంగతి,

సుంద—ఎరుగనని, నాపై నోట్టుబెట్టినవాడవుగాదా !

సెట్టి—నిజంగా మిమ్ము సంపుకుతిన్నట్టే. బలపరిదానసంగతి నేను యెరుగనే యెరుగను.

సుంద—దానిపేరేయది.

సెట్టి—అలాగాండి. తెలవకన్నాను.

సుంద—నీసంతగార్యము జరిగించి,మావంటివారలకు,సంభావన,యివ్వ కుండుట, భావ్యమేనా?

సెట్టి—మీ సేతిలో వాడనేగెండా. ఎప్పుడుబడితే, అప్పుడే పుచ్చుకో వచ్చు.

సుంద—(తనలో ఎగవేయుటకు యుక్తిబన్నుచున్నాడు) ఎప్పటిసంతోష మప్పుడే.

సెట్టి—(జేబులుచూచి) లెక్కలేదు. మరొకప్పుడు, దర్శనము చేయండి.

సుంద—ఏమీ! నీదర్శనము, మేము, చేయవలయునా?

సెట్టి—మీరాలాకోపముతో, మనవిచేసుకుంటే, మేము సిత్తగించు టెట్లు పంతులుగారూ!

సుంద—(చెయ్యిబట్టుకొని) యిచ్చెదవా లేదా?

సెట్టి—(వడకుచు) సెయ్యి వదలండి, సెప్తతా.

సుంద—(చేయి విడచును)

సెట్టి—సిల్లర లేదండి.

సుంద—(జేబులువెదకి పదిరూపాయిలనోటు పైకిదీసి) ఇదియెచ్చు టోయి, లేదంటివే.

సెట్టి—సిల్లరనోట్లు లేవంటినా, పెద్దనోట్లు లేవంటినా?

సుంద—సరే, యింకవెళ్ళుము

సెట్టి—(కొంచెమునడచి తనలో) యెదవరూపాయలు పోతే పోయినవిగాని, తన్నులు తప్పాయి. ఏబేరంలోనో బోల్తాగొట్టించి దీనికి పదిరెట్లు లాగకుందునా (నడచుచుండును)

సుంద—సెట్టీ- సెట్టి! మరొకమాట

సెట్టి—(తిరిగిచూచి తనలో) మళ్ళీయేదో కొంపమునిగిందోయి దేవుడా! (పైకి) బాకీలు వసూలుచేయడానికి యెల్లాలండి.

సుంద—మంచిమాట ఇది విని మరిబొమ్మ
సెట్టి—(దగ్గరకువచ్చి) యేదోచెప్పండి?
సుంద—అయితే చూచిచూచి కడకు యానాదిముండకు కన్నెరికము చేసినాడవేమోయి?
సెట్టి—ఎవరన్నారండి?
సుంద—నే నెరుగనాయేమి?
సెట్టి—ఏదోయొకటి. యింకోళ్ళయితే కొరుక్కుతింటామాయేంటి. కాని యీమాట మరెవ్వరికిని తెలియనియ్యకండి.
సుంద—నాకుమాత్రము తెలియదా. సరే నీవేగుము నేనును బోయెదను (నిష్క్రమించును)
సెట్టి—ఇదీసంగతి. ఎవారాలు యీలావున్నాయి. ఆవోయాబై-యివోపది. ఇంతటితో బుద్దొచ్చింది-(నిష్క్రమించును)

---

## చతుర్థరంగము.

(తెరలేచునరికి నరహరియు, హేమకళయు గూర్చుండియుందురు)

హేమ—అమ్మా! నాకు కాసులుపేరు చేయించిపెట్టవే?
నర—బంగారుగాజులు చేయించితినిగదా. నీయదృష్టము మంచిదైన కాసులుపేరన నెంతభాగ్యమే?
హేమ—వాళ్ళపాపాయిని చూడు యెన్నినగలు చేయించుకొనెనో?
నర—ఏనాటిపాయియే. దానికిప్పుడు కొంచెము బుద్ధి కుదుటబడినది గనుక నాలుగుగుల్లలు చేయించుకొనుట మొదలుపెట్టినది. దానికే మొదటినుండియు బుద్ధి సరిగాయున్నయెడల లక్షలు లక్షలు సంపాదించకబోవునా?
హేమ—పోనిమ్మ-సెట్టిగారిచ్చిన రూపాయిలతో చెంపసరములైన ను చేయించు.

నర—అమ్మాయీ! నీవు చిన్నదానవు-నీకేమియు తెలియదు. ఈమధ్య మీయక్కకు బట్టినదయ్యము పురుషగాలినై నను సోకవి. వ్వకబోవుటచే యిల్లంతయు బాకీలతో మునిగిపోవుటచే యీ సొమ్ముతో కొన్ని అవసరమైన బాకీలు తీర్చివేసితిని.

హేమ—ఎవరికి దీర్చితివి.

నర—పెద్దబాకీ కల్లుగంగయ్యది. ముందుతీర్చివేసితిని.

హేమ—మంచిపనిచేసితివి. కానినేటిదినం గంగయ్య యింకనురా లేదు. యేమికారణమో?

నర—వచ్చును.

(సుందరాంగి ప్రవేశము)

సుంద—(ప్రవేశించి)

గీ. నల్లమందును గంజాయి కల్లునీళ్ళు
భంగు మద్దత్తు మానంగ వచ్చుగాని
సానులిండ్లకు మరగిన సరసులకట
ప్రాణ మున్నంతవరకును బాయలేరు

లేడిడెక్కాకార పరిమాణములు గలిగినంత చర్మముపై నీజగమంతయు నాట్యమాడుచుండ, నేనొక, లెక్క; యీపురంధ్రిను బుట్టిన బుద్ధి పుడకలతోడనే మానును, (చూచి) అదిగో, తల్లి కుమార్తె లేదియో, ప్రసంగించుచున్నారు. సెట్టివద్దకొట్టిన పదిరూపాయలున్ను వీళ్ళకు బారవేసి యిచట నాదివిటీకొంత వెలిగింతుగాక.

గీ. సాని ధనమున కాసించి సరసుజేరు
జారుడన్నను వలపుచే సానిగూడు.
ధనముతగ్గిన సరసుల తరుముభంగి
వలపుమళ్ళిన సానుల వదలివేయు.

యిం దుభయులును సమానులే. (సమీపించి) నరహరీ!

నర—(చూచి) ఓహో! సుందరంపంతులా! తోవదప్పివచ్చినట్లున్నది. దయచేయుండు.

సుంద—నీచిన్నకుమార్తెను, చూడదలచి.

నర—ఈమాట, వసంతసేనవిన్న మీకు మోసమురాదా?

సుంద—దానిని వదలివేసి చాలకాలమైనది.

నర—(తనలో) ఇటువంటిబండ మాకొకడుండితీరవలయు. ఇతగాని వద్ద ధనమంతయు వట్టిపోవుటచే నేచెప్పినట్లు వినితీరును. (ప్రకాశముగా) నాకంతయు తెలిసినదిలెండు. లేకపోయిన అదియా మిమ్ము నిరవాకముచేయుట, ఇంతటితోనైనను కండ్లుదెరచినారు. ఇదియే మీకు పదివేలు (హేమవంకజూచి) పిల్లా! పంతులుగారువచ్చి కూర్చున్నదిచూచియు తాంబూలము యివ్వవేమే. చాలాసరసులు లాభముండునులే.

హేమ—(లోపలికిబోయి తాంబూలపళ్ళెరముతో బ్రవేశించి సుందరావువద్ద బెట్టి నిలుచుండును.)

సుం—(పళ్లెరమునందు పదిరూప్యములనుంచి) నరహరీ! నేనిటకు రావలెనను యుద్దేశ్యముతో రాలేదు. మార్కెట్టునకు బోవుచుండ మీమాటజ్ఞప్తికివచ్చి, యిటు మరలితిని. ప్రస్తుతమింతటితో సంతసింపుము.

నర—దానికేమి. ఎంతమాట. మీరుసరసులు. మేముసానులము. మీరివ్వవచ్చు, మేము గ్రహింపవచ్చు. తెలిసినదా? (హేమతో) అమ్మాయీ! చిలుకలుజుట్టి పంతులుగారి నోట బెట్టవే. (సుందరావుతో) బాబూ, చిన్నపిల్ల. మీబోంట్లు నలుగురి చేతులలో నలుగువరకును మామూలుమర్యాదలు తెలియవు.

సుంద—దానికేమి, నేను మీయింటికి క్రొత్తవాడనా యేమి?

నర—అదీసంగతి. మీకు తెలియని హంశము లేమున్నవి?

హేమ——(తమలపాకులు, చిలుకలు, చుట్టబోవుచుండును.)

సుంద——పిల్లా! చుట్టవలదు. నేనిట నాగలేలులేదు. తొందర పని యున్నది.

నర——బాబూ! యేమాతొందర రాకరాకవచ్చి?

సుం——సాయంత్రము వచ్చెదను.

నర——తప్పక రావలయును. మీతో మాటలాడవలసినసంగతులు,చాలగా నున్నవి.

సుంద——అట్లే వచ్చెదను.

నర——(హేమతో మెల్లగ) రమ్మని చెప్పవే.

హేమ——సాయంత్రము దయచేసెదరా?

సుంద——నీవు కోరినమీద రాకుండనుందునా?

నర——అల్లుడుగారూ! సెలవా?

సుంద——మంచిది. (నిష్క్రమించును.)

(తెరలో పాట)

హిందూస్తానిమట్టు (ఐసూబణీమెరవలె)

సాడీబడీమెర- చోలీబడీమెర- దేఖోరెసబ్ మెరెకస్థా॥సాడీ॥

అచ్ఛమెరెమాల్ మోల్కే- మేలుకల్గునయ్యా- మెర్పుసూడుడయ్యే

ముఖ్మల్‌హౌషారీ బనా మల్‌మల్ హౌషారీబనా।

అరెకాంకాం-అరెఅరె అర్వ్యలకు- సర్వ్యలకు ॥సాడీ॥

హేమ——(ఆలకించుట నభినయించి) అమ్మా! బట్టలసాహేబు వీధి వెంట బోవుచున్నట్టులున్నది బిలుచుకొనిరమ్మా.

నర——(వెడలిపోయి తిరుగా బట్టలసాహేబుతో బ్రవేశించును.)

సాహేబు——(బట్టలమూట క్రిందబారవేసి, హేమనుజూచుచు) అరే! బాప్ రే బాప్. (తనలో)

హిందూస్తానీమట్టు.

దీనియందం- సూడగానే- దీనికాల్కి- మొక్కవాలావుంది. (అరె)

గుమ్మంమె- కూర్కొంది గుబ్బల్కి- సూపిస్తా గుంమైన్న- రం
గెలి రండీకిజేతే ॥దీని॥

పాణాన్కి- నొదిలేస్త- ప్యారికి - తగిలేస్త- జోహూను- జేరింక-
జోహారుజేస్తా॥దీని॥

హేమ—సాహెబు! యేమేమిరకము లున్నవి?

సాహే—అచ్ఛామాల్, తాజామాల్, టర్కీమాల్, మొఖమల్,
మల్మల్. సబ్ హై.

నర—మూటవిప్పి చూపించండి.

సాహే—అచ్ఛా (మూటవిప్పును).

నర—(మూటవద్ద గూర్చుని) అమ్మాయీ! యిటువచ్చి నీకు కావ
లసినవి చూడు.

సాహే—హా! ఆవ్, బైఠో, దేఖో.

నర—సాహెబుగారు మంచివారే.

సాహే—మాకీమంచి, మీకీమంచి.

హేమ—(ఒకచీరదీసి) సాహెబుగారూ. యిదియెంత ఖరీదు?

సాహే—యిది చేరూపియా, ఏక్ గజ్.

నర—(మరొకటి దీసి) ఇదెంతఖరీదు?

సాహే—యేదాం జాస్తీ. ఏక్ గజ్ బారారూపియా, హోయెగా.
అవ్వల్ మాల్.

హేమ—ఏమిటండి! ఖరీదు చాలాహెచ్చుగా నున్నదే!

సాహే—క్యా, ఎక్వావుంది? ఆప్కామర్జీ లేలేవు. చీరల్మె నఫానై
తో ఫర్వానహీవుహిహై. మాకి రైకల్మే నఫాసేస్తాయిలేదు

హేమ—అనగా?

సాహే—కుచ్ నై. మీకీసూస్తే మాదీబీబీకి సూసినట్టు సంతోషం
దిల్మే బోలింది. (సంతోష మభినయించును.)

నర—అమ్మాయీ! నీకు కావలసినవి యెంచుము. తరువాతసంగతి నేను చెప్పెదను.

హేమ—(కొన్ని యెంచుచుండును).

సాహే—(లోపలికి చూచుచుండును.)

నర—సాహేబుగారు! అలాచూచుచున్నారు మాయిల్లు లోపలచూచెదరా?

సాహే—అచ్ఛా! అదిమాకీ సూడవాలావుంది.

నర—అమ్మాయీ! సాహేబుగారిని లోనకు గొనిపోయి నీగదిము స్తాబు చూపించు.

హేమ—సాహేబుగారు! లోనకురండు. (ఇరువురు నిష్క్రమింతురు.)

నర—(కొన్నిబట్టలునేర్చి లోనకు గొనిపోయి తిరుగా బ్రవేశించి) మా కామయు నేజెప్పినట్లు విన్న మాకేలోటునుండదుగదా!

గీ. వరుస పులగంబు మీఁదను పప్పుపగిది
సొమ్ముపై సొమ్ము లంతగా గ్రిమ్ముకొనిన
పప్పుదోసెడి విధమున నప్పులెల్ల
చప్పుచప్పున సవరించి సంతసింతు.

ఎట్లయినను మాహేమనుకొన్నవేళ మంచిదే. తెలివిమాలినవారలు యేమో యందురుగాని,సాగివచ్చిన సానివృత్తికిని,చలిజ్వరము నకునుమించినసౌఖ్యమున్నదా?మాహేమసంపాదనజూచియు, కామకు, బుద్ధిమారకుండునా. తప్పకమారగలదు.

(సాహేబు బ్రవేశము)

సాహే—(ప్రవేశించి) అరే! ఛూ, ఛూ (అని యుమ్మివేయుచుమూతి తుడుచుకొనుచుండును.)

నర—అది యేమండి.

సాహే—ఆది, నీకి, యేమికావాల?

నర—నాకుమార్తె

సాహే—దగుల్బాజీ

నర—(తొందరతో) సాహేబుగారు! సంగతియేమి, సెలవియ్యండి?

సాహే—అరే, నాకీ, లోపల్కి, తీసోకె వెల్లి, బద్మాష్‌పని, చేసిందిబే.

నర—తొందరపడక, యేమిజరిగినదో, చెప్పుడు.

సాహే—నాదిమూత్కి యెంగిలి, రాసింది. ఉపాసాలపంపుగ తెలుసునా లేదా?

నర—ముద్దు పెట్టుకొన్నదా.

సాహే—ఛీ, ఛీ, (ఉమ్మివేయుచు) థూ, బద్మాష్ (బట్టలమూటనం కజూచి) అరే, బుడ్డీ, మాది మాల్‌యేది?

నర—ఉన్నదిలెండు.

సాహే—ఉంది గింది, జాంతానహీ. ఇక్కడలా.

నర—తెచ్చెదను, ఎచటికిని పారిపోను. ఏమాతొందర?

సాహే—అరే, థూ (మొగముపై నుమిసి) బాత్ మత్ కరో, పైమాల్, యిదర్, రఖో

నర—ఇంక నామాట వినరాయేమి, మీగొడవయేగాని,

సాహే—అరేబుడ్డీ! మీకీ, తాణామే, బోలింగే, జైల్‌మే, రక్కింగే. చోర్‌వాలా, లావ్‌మాల్, జల్దిలావ్.

నర—(తనలో) వీడెవడో బటాచోరులాగున, కాన్పించుచున్నాడు, మెత్తగ మాటలాడిన లాభములేదు. కొంచెము, కరుకు, జూపింతుగాక (ప్రకాశముగా) ఏమండోయి, సాహేబుగారు! మీయుద్దేశ్యమేమిటి? మీడచ్చాలిచట పనికిరావు. బాస, నీవు రేగినయెడల పంబరేగును, జాగ్రత. మేమెవరమనుకుంటిరి? లైసెన్సుదార్లము.

సాహే—రే, రండీముండ! మాటయెక్వాసెస్తావ్. యేముసల్మాన్‌కా

బేటా, కపడ్దార్ (జుత్తుపట్టుకుని) దేయెగా, మాల్, నై దేయె
గా, బోలో, ముక్కు మీద, గుద్దుతాన్, బే.

నర—అమ్మాయీ (వణుకుచుండును)

కామ—(బట్టలతో బరివేశించి, సాహేబు మీద భారవైచి) అమ్మా
నీయాశకంతము లేదు. అందువల్లనే, యింత మునుగుచున్నది.

నర—(ఊరకుండును)

సాహే—(బట్టలుమూటకట్టి భుజమునతగిలించుకొని) రే, బుడ్డీ! పట్టీ
మారేకు, సూశావు. ఇది, మొంబైకా, పట్టీ. అచ్ఛాభజా
యింగే. (తనలో) మాది, దిల్, కుషి అయింది.

(సాడీబడీమెరె చోలీబడీమెరె, పాటబాడుచు వెడలిపోవును.)

నర—ఏమిజరిగిన దే.

కామ—చాలులే, చెప్పకుంటే? సిగ్గుసిగ్గు. అవ్వ (నోరునొక్కుకొనును)

నర—అబ్బా, ఎంతసిగ్గే, యీబాధయంతయు, నాకొరకేనాయేమి.

కామ—మాకొరకు నిన్ను, యేడ్వమని, చెప్పలేదు. లోనికిరమ్మా.
పిల్ల యేడ్చుచు కూర్చున్నది.

(యిరుపురును నిష్క్రమింతురు)

( తెరవాలును )

ఇది ద్వితీయాంకము.



శ్రీపరమేశ్వరార్పణమస్తు.

# కామకళ

## తృతీయాంకము.

(తెరలేచునరికి కామకళ యొంటరిగ వసారాయందు గూర్చుండును)

కామ—కన్నతల్లియగుటచే నేనేమియు యనలేకుంటిని. నేనీ పాడువృత్తిని నిరసించుటచే మరొకదానిని బెంచి దానిచే నాటక మాడించుచున్నది. కన్నులు తెరవని పసిబిడ్డ, దానికేమి తెలియును? నాకై యేడ్తునా, దానికై గుందుదునా? ఓకృష్ణా! ద్వారకీవాసా!

క. పంచప్రాణంబులు నీ
పంచనెయుంచితి జరిగిన పాపము వాపన్
వంచనలందున ముంచక
మంచిగ నను నేలు మింక మాధవకృష్ణా!

మాతల్లికెంత చెప్పినను లాభములేదు. అందుచేతనే మాహేమకు వ్యభిచారమందున్న కష్టములు బోధించి మనసు మార్చదలచి యిటరమ్మని చెప్పతిని, ఇంకను రాకున్నది, కారణమేమైయుండునోగదా (గూచి) అల్లదే వచ్చుచున్నది.

హేమ—(ప్రవేశించి) అక్కా! యెందులకు బిలచితివి?

కామ—చెల్లెలా!

గీ. కష్టసుఖములు తెలియని కన్నెవీవు
పడుపువృత్తిని గల్గెడు బాధలెల్ల
తేటతెల్లంబుగా నీకు తెలియజేసి
ప్రియము గూర్పంగ చెల్లెలా బిలచినాను.

హేమ—(తనలో) మాయక్క యేదేని మాటలు జెప్పిన విననలదని మాతల్లి, ముందుగనే బోధించినది. అయినను యేమిచెప్పునో విందుగాక (ప్రకాశముగా) యేమాబాధలు?

కామ—చెప్పెదనుగాని ముందీసంగతి వినుము.

హేమ—ఏదది?

కామ—ముదుసలులకు జ్ఞానము నశించును. అందుచే మంచి చెడ్డలర యజాలుశక్తి తగ్గిపోవును. ధనమందేయాశ మెండుగ జనించును.

హేమ—ఔగాక

కామ—ఔనుగదా. అందుచేత నీవు మనతల్లి చెప్పినమాటలనుసరించి వర్తింతువేని నీవు గవ్వకైనను మాఱకుండ బోదువు.

హేమ—(తనలో) నేను నగలు చేయించుకొనుట జూచి యోర్వలేక, తానుచెడినదిగాక నన్నుగూడ చెరచుటకు జూచుచున్నది. అమ్మ పాడుచేయునదియు యీమె బాగుచేయునదియు (తల యూచుచు ప్రకాశముగా) అక్కా! అమ్మ తెలివిహీనురాలనియా నీయుద్దేశ్యము.

కామ—తెలివిహీనురాలని నేజెప్పుటలేదు, మనలను మించిన తెలివి గలదియే కాని, యా తెలివి మంచికార్యములందు వినియోగపర్చక చెడుకార్యములందువికసింపజేయుటయే తెలివితక్కువ తెలిసినదా.

హేమ—నేనందులకు సమ్మతింపను. అమ్మ చేసెడు చెడుకార్యము లేమిగలవు?

కామ—కల్లుత్రాగుట మంచికార్యమా?

హేమ—చిన్ననాటనుండియు నలవాటగుటచే మానలేకపోవచ్చును. పరులను బాధించుపనిగాదు.

కామ—పోనిమ్ము. నీకు యలవాటుజేయుట దోసమగునా కాదా?

హేమ——అక్కా! ఇన్నిమాటలు నాకు తెలియవు. నీవు ప్రతిరోజు నను దేనికో యొకదానికి అమ్మతో పోట్లాడుచునే యుందువు. ఆ ద్వేషబుద్ధియే నిన్నిమాటలు నీచే బల్కించు చున్నది! ఏదేని చెప్పదలచిన చెప్పక యమ్మపై దోషారోపణ మెందులకు?

కామ——వెర్రిపిల్లా! అమ్మమీద, నీకు, నాకన్న నెక్కుడు ప్రేమ యుండునా?

హేమ——(సగౌరవముగా)

గీ. హేమ్నప్రతగ్గులు చెప్పంగ ముచ్చటైన
అడిగితివిగాన నాకుండె నధికప్రేమ

కామ—— నిన్న మొన్నటి దానవు నీకెయుండ
కన్నతల్లిపై నాకెంత కలిగియుండు.

హేమ——ఉండిన నుండుగాక. ఇందులకేనా, నన్నిటకు బిలచినది.

కామ——చెల్లెలా! నీవు పసిబిడ్డవు- మంచిసంగతులు నీకు బోధించవలెనని యాశ్రీకృష్ణపరమాత్మసాక్షిగ బిలచితిని.

హేమ——చాలులే, యింతమాత్రముతో- ఇప్పటికే నిన్న మొన్న యని మొదలుబెట్టితివి. నీ బోధనలకును, నీకును యొక సమస్కారము- ఇంతటితో నన్ను వదలిపెట్టిన జాలును.

కామ——బిడ్డా! ఆగ్రహింపకుము.

(యాచకుడు ప్రవేశించి) అమ్మా!

కామ——అయ్యా! వెళ్ళుము.

యాచ——(దీనముగ) అమ్మా! కడుపు మండిపోవుచున్నది. జీవము నిలువబెట్టుడు.

కామ——హేమా! కొంచెము బియ్యము తెచ్చి వెయ్యుము.

హేమ——నేను లేవలేను (యాచకునితో) వెళ్ళుమని చెప్పాట నీతో డనే.

యాచ——ఇంతగంజియైనను బోసిన చాలును.

హేమ—అధికపరిసంగము చేయక బొమ్మ్మా,

యాచ—అమ్మా! పోకనిలతుమా? ఇందుల కింత కోపమేల తల్లీ!

హేమ—ఓరీ! మాటాడక వెళ్ళెదవా, గెంటించవలెనా?

కామ—హేమా! అతనితో నేమి (వారించును)

యాచ—(కన్ను లెఱ్ఱజేసి, కోపముతో)

గీ. నీడు వృత్తులకన్నను నీచమగునె
కానిడబ్బుకు నాసించు గణికవీవు
యోరి మోరంచు కూతువె యోసిదెప్ట
బిచ్చగాడని నిరసించి గచ్చులాడి.

రెండుపిక్కలు చేతజిక్కనంతమాత్రముననే-

గీ. కనులు పొరగప్పెనా నీకు కారులర్వ
పశువులను మీరి వర్తించు భ్రష్టురాల
పరగడనుదిని బ్రతికెడు పరిపిల్ల
వేయిరెట్టుల యధికంబు వేశ్యకన్న.

నాల్గుడబ్బు లెటులనో సంపాదించి నేనే తెచ్చి నీకర్పించినచో నన్ను
బ్రహ్మరథముబట్టు, నీకా యీ తెగసాగుడు, జాగ్రత.

కామ—అయ్యో! క్షమింపుడు తెలివితక్కువచే బలికినది, తప్పు
మాయదియే.

యాచ—తప్పా, తప్పున్నరా?

క. రారా! పోరా! మొద్దా!
చోరా! పలుగాకి! కుంక! శుంఠా! ఫాజీ!
ఓరీ! యని సరసగతుల
వారాంగన చవటవిటుల వాకొననొప్పున్.

చవటవిటులనగానెటువంటివారలో చెప్పెదను వినుము,

గీ. కొంతధనము తిరిపెమున కూడబెట్టి
సానికర్పించి యామీద సాకలేక
దానిచెలిమిని విడలేక దారిలేక
యిల్లు యిల్లాలు యిహసుఖ మింతలేక
బంధుగుల జూడలేకను భ్రష్టులగుచు
పడుపుకూటిని దినుచును పరుపుమాలి
నీచవృత్తుల జేయుచు నేర్పుతోడ
సానిపదము లొత్తెడువారె చవటవిటులు.

అటువంటివారలనుగాక, నన్నాతూలనాడుట-

కామ—అయ్యా! వందనములు, మాయందుదయయుంచి క్షమింపుడు

యాచ—గీ. సర్దిచెప్పంగ నీకేమి బుద్ధియేడ్చె
పిన్నపెద్దలు నొక్కటే వేశ్యలందు
కంచుకాగడ వెలిగించి కలయవెదుక
నత్తగుల్లల మధ్యను ముత్తెమున్నె.

ఛీ! మీతోడ పరిసంగము వృధాయాసము (వెడలిపోవును)

కామ—(తలవంచి విచారము సూచించును)

హేమ—అక్కా! నన్ను నిలచినది, యీ ముష్టివానిచేత దిట్టించు టకా? ఏమియు నెరుగనట్లుందువు. ఎంత మాయలాడివె? అమ్మతోచెప్పి నీపని బట్టించెదచూడుము (నిష్క్రమించును)

కామ—(తలపైకెత్తి నిటునటు కలయజూచి) ఔరా! కష్టా! నీచర్య లద్వితీయంబులుగదా నీవిటుల జేయుటచే నే నిసుమంతయు, ఖేదపడుటకు మారుగ సంతసించు చుంటిని ఏమందువేని మొన్నటి తురకవాని, దౌర్జన్యమును, నేటి యాచకుని బోధ నయు, చిగిర్చిన, నావైరాగ్యమొలకకకాలమందే మొగ్గ దొడగినది. ఇంక, కాయగాచి పండి, ఫలితమునకు, వచ్చు

జెన్నడోకదా. అంత దనుకను, నీవు నా హృదయమందు నివసించి నన్నన్యథా వర్తింప జేయకుందువుగాక!

గీ. ప్రియము గూర్పంగ చెలియను బిలువనంప
యాచకునిరీతి నీవిట గోచరించి
నీతిబోధింప తెలియంగ నేర్పులేక
కోపమొదవెను నామెకు గోపబాల!

మాధవా! మా సోదరిమాటలనమ్మి మా తల్లి రుద్రావతారముతో నిట సాక్షాత్కరించుట నిజము. నీవామె హృదయంబున బ్రవేశించి, శాంతచిత్తురాలినిగా జేయప్రార్థన.

(నరహరి ప్రవేశించి)

నర—ఏమే కామా! కూసేగాడిద, మేసేగాడిదను చెరచె నన్నట్లు నీవు చెడినదిగాకుండ, పిల్లనుగూడ బాడుచేయదలచితివా?

కామ—అమ్మా! నేనేమిచేసితిని?

నర—ఏమో నీతులుపదేశింప మొదలుబెట్టినావట!

కామ—నీతు లుపదేశించుటయు దోసమేనా, తల్లీ!

నర—నీనీతులు మండినట్లేయున్నవి. చాలుచాలు. కూటికి లేక, కంటికి మంటికి నేకధారగా, అలోలక్ష్మణా యంచు, యేడ్చుచు నీవల్ల నిరవాకము, నీళ్లుగారుటచే, దానిచేనైనను, జీవయాత్ర గడు పదలంచుచుండ, నీకేమిపోగాలమే? పైగా, నెవనినో బిలచి, వానిచేత, దిట్టించినావట.

కామ—గీ. తాను దలచినదొకటైన దైవమొక్కటి
దలచెననుమాట నాపట్ల తథ్యమయ్యె
హేమబిలచితి నిటకునే హితముగూర్ప
పాపమెరుగను తల్లినీ పాదమాన.

ఆతడెవరో, యాచకుడు. నేనెరుగను. నేతిట్టించిననుమాటకల్ల, కాని; యాతనిపల్కులు, వేదాక్షరంబులు.

నర—నీవంటి తెలివితక్కువ, పెద్దమ్మలకు, ముష్టివారలమాటలు వేదాక్షరంబులుగాక, సంపన్నులహితములు నచ్చునా. నీవేమి దలంచితివోగాని, యిట్టిసమయమునందు నీవిట్లులుండిన,

గీ. చచ్చువరకును, నీయెడజవ్వనంబు
నిలువబోదని యెంచుము నిశ్చయముగ

కామ— అందుచేతనె, తల్లిరో నాశవీడి
స్థిరముగలదానికొరకు నే జేరుచుంటి.

నర—కండ్లుతెరచి మాట్లాడుము ముందువెనుకలు, నాలోచించుకొనుము.

కామ—అమ్మా!

సీ. మద్యపానంబుచే మత్తెక్కిపడియున్న
సరసుని, పొత్తేటి సౌఖ్యమగును
నేటరేపటిలోన కాటికిబోనున్న
ముదుసలి పొందేమి ముదముగూర్చు
కుష్టురోగంబుచే కుళ్ళినమనుజుని
నోటిలో నోర్వెట్ట వాటమగునె
పసరంబులనుమీరు భ్రష్టులనను జేరి
సరసంబులాడిన జచ్చిపోనె

గీ. ధనముకొరకును నేనింత దారుణముగ
సర్వసుఖములు పుణ్యంబు సమయజేసి
మంచినరయక నీవెంత చించుకొన్న
దైవసాక్షిగ నేనొల్ల తల్లివినుమ.

అమ్మా, అంతయు పరిశీలించియే ప్రవర్తించుచుంటిని. ఇంకనీవిషయమై నాతోడ బలిసక్తిమానుము. నీవు చెప్పినట్టులే విన్నచో.

గీ. అన్నిటికి నోర్వ ఫలితంబు లబ్బుగదగునె
కూడవచ్చెడి పుణ్యంబు కూలద్రోసి
కూడరానట్టి పాపంబు కూడగట్టి
చూడవచ్చును నారక సుఖములెల్ల.

నర — నరకము స్వర్గము పుణ్యము పాపము యీమాటల కేమి లేచూచినవార లెవ్వరైన యుండిరా. ఏదో, లోకము కట్టుబాటుల నిమిత్తమేర్పడినవిగాని స్వర్గములు లేవు. నరకములు లేవు.

కామ — అమ్మా! పోనిమ్ము. లేవనియే భావించు. కాని చూచుచుంటిని గదా, నీవరిణములు నీవుపడెడు బాధలు. ఇంతకన్న వేరునరకమేమిగావలయు తల్లీ! నీవటుల బాధలనొందుచు, నన్నా బాధల చవిజూడమనుట న్యాయమా?

నర — నీవేదాంతముముదురుచున్నది. పోనిమ్ము, మంచివారలనేజూచి కొని సుఖయించుచు నన్నింత సంతసబెట్టరాదా?

కామ — తల్లీ! యిందనేక నష్టకష్టములున్నవి. మనము కోరినవారలు మనయిండ్లకొత్తురా. సర్వము నెరింగిన నీవే యిట్లు మాటాడిన నేనేమిచెప్పగలను.

గీ. పద్మినీజాతి బుట్టిన పద్మముఖుల
నశ్వజాతి పురుషులకు నంటగట్ట
వృషభ మహిషంబులనుగూర్చి వేడ్కగట్టు
బండినడచెడు విధము దంపతులపొత్తు.

నర — అయ్యో! నామాటలన్నియు పెడచెవినిడుదువా! నే దిక్కులేక చావవలసినదేనా!

కామ.—అమ్మా! నేనుండగ, నీవంత దిక్కుమాలినచావు చావవలశి నంత గతియేల.

నర.—నీవుండుటచేతనే నాకీపూట నల్లమందుకే గతిలేకపోయినది. అయ్యో, కాళ్ళు పీకికొనిపోవుచున్నవి (బాధనభినయించును.)

కామ.—తల్లీ! నీవాక్యంబులకు నేనసమాధానమిచ్చిన నీకేమియాగ్రహ మొచ్చునో యని భయపడుచున్నదానను. అయినను చెప్పెద వినుము.

గీ. నల్లమందును గంజాయి కల్లునీళ్ళు
ముక్కుపొడుమును చుట్టలు పుట్లకొలది
కరవులేకుండ యిచ్చెద కాల్చిపీల్చి
త్రాగి మత్తెక్కి పడిపోవ తల్లి నీకు.

నీయారాటమంతయును వీటికొరకే. నీకేకొరంతయుకలుగకుండ, నన్ని యుసమకూర్చుచుండెదను.విచారముదక్కియుండుము.నీవింక బొమ్ము. నేటిదినమేకాదశి.నదికిస్నానమాచరింపబోవలయు. నన్నింక విడువుము. నీకు నమస్కారములు.

నర.—అంతియేగాని కులవృత్తిలో మెలగి పేరుకీర్తులుసంపాదించదలచ లేదన్నమాటయేనా?

కామ.—అమ్మా! మాటిమాటికిని కులవృత్తి కులవృత్తియని పేర్కొను చుందువెందుచేత.గౌరవములేనిదిక్కుమాలిన నీచవృత్తి.యీ పాడువృత్తిచేనెంతధనముసంపాదించిననుయవసానకాలమునద హనసంస్కారములకు ధర్మకట్టెలేగాని యింట నల్లపూసయైన నుండనేరదు. నీకన్నులతో నీవెన్నిజూచియుండలేదు. ఈవృత్తిచే నిన్నిలక్షలుసంపాదించిమహాగౌరవముతో కాలముబుచ్చి,మం చిపేరునుబొంది, దానధర్మములనుగావించి గతించెనన్న నారీ రత్నమును వ్రేలుముడిచి చెప్పగలవా? లేవు. కావున కులవృ

త్తియో పరవృత్తియో నీకెందులకు. నీకేలోటుపాటులు లేకుండగాపాడిన జాలదా.

నర—ఔరా! పొగరు. తల్లినని కొంచెమైనను గౌరవములేక మాట్లాడుచుంటివే? సన్యాసులలో గలసిపోయెడుదానికి నీకీనగ లేల అన్నియుదీసి యిమ్ము. నీకర్మము నీది. నాకర్మము నాది.

కామ—(సంతోషముతో నగలన్నియు తీసియిచ్చును) అమ్మా! వీటితో నాకేమియు బ్రయోజనములేదు. ఇవినీకిచ్చుటచే నాకుండెడి గొప్పభారము తగ్గినది. నాకు మహోపకారము గావించితివి. తల్లీ నీకు వందనములు. (పాదములపై వ్రాలును.)

నర—(కాలు విదలించుకొని) ఛీ! నీనక్కవినయముల కేమి? (నిష్క్రమించును.

కామ—ఆహా! నాతల్లికి యీనీచవృత్తియం దెంతయభిమానమో! తనశరీరము యావత్తు గుల్లయై, చెడువ్రణములు, దుర్వాసనగొట్ట, రసకంతులు బయలుదేరి, మోరలుదిగి, యమయాతనబడుచున్నను, సిగ్గులేక, మమ్ములనావృత్తిలో బ్రవేశపెట్టజూచుట మూర్ఖతగాక మరేమందును? ఈపాడుశరీరమున కేమియో సలంకరించి ప్రపంచమును మోసగింపవలెనా? లేనిప్రేమను గల్పించుకొనవలెనా? ఆహా! యేమి విరుద్ధము- యీవారకాంతలను భూలోకరక్కసులచే నీవరకెందరు భస్మీపటలముగాలేదు? ఎందరెందరు పతివ్రతామతల్లులు తమపతులకు దూరమై మమ్ములను శపియించుటలేదు. పతివ్రతలన్న త్రిమూర్తులు సహితము గడగడ వడంక, మాకులమున కాభీతి యానంతయు లేక శాపదగ్ధులగుటకుమారుగ, తామరతంపరట్లు నానాటికభివృద్ధి జెందుచున్నదే! పాపీచిరాయు వన్నట్లున్నది. పెరుగుట నిరుగుటకొరకను లోకోక్తి మాజాతియం దెన్నడు సార్థకపడు

నో తెలియరాకున్నది-కృష్ణా! ద్రౌపతీమానసంరక్షణా! ఆప ద్బాంధవా! నన్నీ నీచకులమందేలబుట్టించితివి? పుట్టించితివిబో నీయందీభక్తి వైరాగ్యము లేల యంకురింపజేసితివి? దినమున కొక్కని కీపాడుశరీర మమ్ముకొని జీవించుమనియా! నన్ను బు ట్టించుట? అటుల జేతువనుట కల్ల. నిన్ను సేవించి తరించుటయే నాముఖ్యోద్దేశ్యము. నాసర్వస్వము నీవేయని భావించు నాకే కొరంత వాటిల్లును? నీవు నన్నీ విషమపరీక్షలమునంచి బాధింప జూచుట నీదేహమును నీవే బాధించుకొనుటగాదా?

గీ. రాధ తిట్టిన గొట్టిన మరణ నీవు
కోపమును మాని గూర్తువు కోర్కెలెల్ల
వివిధగతులను బూజించి వేడుచున్న
నన్ను దరిజేర్ప భారమా నళిననాభ!

యీదీనురాలి మొరాలింపుము. నీసుందరవదనారవిందసందర్శనము నకై నామనంబు తొందర జెందుచున్నది.

ఉ. మించిన దైవమీవనుచు మేలును గల్గగజేతువంచు, నీ
పంచను జేరినాను భువి బంధములన్నియు దెంపివేసి నీ
వించుక జూడకున్న నిక నెవ్వరు దిక్కగు దీనురాలికిన్
ముంచిన దేల్చినన్ సరియె పూవులరంగడ కృష్ణారాయుడా!

దీనజనశరణ్యా! భక్తమందార!

సీ. హరిహరియని నిన్ను మొరలిడి వేడంగ
కరిచెర విడిపించి గావలేదె!
ద్రౌపతి వేడంగ ధైర్యంబు నెలకొల్పి
వలువల నొసగి గాపాడలేదె!
పిడికెడు నటుకులు ప్రేమతో నివ్వంగ
సిరు లిడలేదె కుచేలునకును!

బాలుండు ప్రహ్లాదు భక్తితో వేడంగ
దర్శనం బిచ్చిన తండ్రివీవు!

గీ. నిన్ను వేడినమాత్రాన నీరజాక్ష!
సకల కష్టము లడుగంటి సమసిపోవు
సర్వసముడను నామంబు సార్థపడగ
నన్ను నీలోన జేర్పుమా కన్నతండ్రి!

పాపపంకిలమైన నీచజాతియందు బుట్టియు, నీయందే భక్తి కుదురుటనాభాగ్యము. అట్టితరి నిన్ను విడనాడి తుచ్ఛసౌఖ్యములకాశింతునా?

గీ. నిన్ను పూజించు కరముల నీరజాక్ష!
సరసు నాలింగనంబుల సలుపజాల
నిన్ను వాక్రాను నోటితో కన్నతండ్రి!
దెష్ట లుమిసెడి నెంగిలి తినగజాల
నీదు నిలయంబుగా జూచు నాదుయొడలు
గుత్తకిచ్చుచు పరులకు గుందజాల
నిన్ను నిల్పిన హృదయంబు నిగమవేద్య!
పాపులకునెల్ల జోటిచ్చి బ్రతుకజాల.

నీకు నాపై దయరాకున్నంత మాత్రమున నిన్నూరక విడచి పెట్టుదానను గానుసుమా!

గీ. రాధసంగతులెల్ల శ్రీ రంగధామ!
సత్యతో జెప్ప నీస్వేచ్ఛ చక్కజేయు
పిదపనాపైన నిష్ఠురం బెంచవలదు
గాన ననుబ్రోవు మావేణు గానలోల!

మంగళాంగా! పాపభూయిష్టంబగు నీచకులంమునం దుద్భవించుటం జేసి చిన్ననాటనుండియు కలుషసాగరమందు బడిక్రొట్టు

కొనుటవలన నాసర్వాంగములు మాలిన్యము జెంది నిన్ను జూచు టకుగాని స్మరించుటకుగాని బూజించుటకుగాని నర్హతలేకుండ బోయినవి. నేనిట్లు జావవలసినదేనా. అయ్యో! దయామయా! ఏలనన్నింత హీనచావునకు లోనజేసితివి. నాకింక బ్రాయ శ్చిత్తమేలేదా! ఓమహానుభావా, నీవుదలంచిన రెప్పపాటులో నాపాపంబులు భస్మము కానేరవా? నీసుందరముఖాంబుజంబు ను వీక్షించునంతనే ముక్తినొందుదురే. నీదయాసాగరమందొ క్కమారు నన్ను ముంచి లేవనెత్తిన పరిశుద్ధురాలనగుదునే. నే నెంతవేడినను నాపై నీకు దయరాకున్నది ఇదినాదూరదృష్ట ముగాక మరేమి. నీయందు భక్తియంకురింపజేయుజ్ఞానామృత మునాకు బోసి మధ్యవీడుట పాడిగాదు. ఓగోవర్ధనా! సత్య భామాధవా! యీయంధకార కూపమునుండి వెలువడుటకు దారిజూపుము. నామొర నిసుమంతయునాలింపవు. హాకృష్ణా! నీవే నన్నిట్లుపేక్ష జేసినచో నాకిట దిక్కెవ్వరు? మొరిక్కెవ్వరు! తోడెవ్వరు! నీడెవ్వరు! హా! ద్వారకీవాసా! శ్రీకృష్ణ! శ్రీకృష్ణ!

(మూర్ఛిల్లును)

(తెరలో)

ఓబాలా! నీభక్తికి సంతసించితి. నీవుకొంతదనుకను, పుడమిపైనుండి నాకుమారుగ, నీతిబోధనలు సలుపుచుండుము. నిన్ను పరిధను మున వరించుపురుషుని భర్తగా నీవు స్వీకరించి, పతిహితము గూర్చుచు పతిపూజ సల్పుచు వానితో యిహసుఖంబులందు ము. పిదప నీకు మోక్షంబు చేకూర్తు.

**కామ**—(లేచి యిటునటుజూచి) కృష్ణా! కృష్ణా! యేమిది మాట్లా డవు. ఎందుడాగియున్నావు. ఇప్పుడేగదా సాక్షాత్కరించితివి.

ఇంతలో నదృశ్యుడవైతివా. అయ్యో! ఇంకనుకొంతకాలమీ యమకూపములో నుండుమనియా నీయాజ్ఞ నీచిత్తము.

(తెరలో)

అమ్మా! నేడు యేకాదశి పొద్దు మీరుచున్నది.

కామ.—(ఆలకించి) యిదే వచ్చుచుంటి (నిష్క్రమించును)

(తెరవాలును)

ఇది తృతీయాంకము.

INTERVAL.






# కామకళ

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

### ఉద్యానవనము

(తెరలేచుసరికి శ్యామసుందరమూర్తి పాడుచుప్రవేశించును.)

సుకళ్యాణిరాగం-ఏకతాళం.

హాయియీయాలేమా - సుగుణంబులగుణధామా - హాయ్ రేసురలోకల
లామా ॥
చంద్రవదననగుమోము- జగమందున గనబోము
సుందరరామ-సుధలసీమ-చూడరతికి-ముద్దులభామ ॥హాయి॥
ముదితనడలురా-యంచలమీఱు- రాయంచలమీరు
సుదతిపల్కు-శుకపికరవముల గేరు ॥హాయియీయాలేమా॥

శ్యామ—ఔరా!

ఉ. కోమలిగన్నదాదిగను కోరిక లీరికలెత్తె నయ్యయో!
భామిని మోవిచక్కెరల పానక మెంతయొ గ్రోలుదాక నా
కేమియు దోచకుండె మదినింతయు సౌఖ్యములేకపోయె న
.క్కామిని రూపసంపదలు గట్టిగ నామది నాటియుంటచే.

(ఇంచుక తలవంచి) ఆహా! నేటివరకును అస్ఖలితబ్రహ్మచారి నని
పెద్దపేరుగాంచి నేనిప్పు డీయబలారత్నమును పరిగ్రహించిన
చో నాపేరుకీర్తులు భగ్నముగావా? నేనింక నల్వురిలో

తలయెత్తి తిరుగగలనా? నేనీయుద్యమము మానుదమన్నను
మదనుండు నన్ను విడువక చెవియొద్ద నిల్లుగట్టుకొని పదేపదే
పోరుచున్నవాడు. అబ్బా! (విరహము నభినయించుచు) ఓరీ
మదనా! నీపూశరంబులచే నన్ను నొప్పించి నామనంబు చిం
దరవందర జేయక యించుక తాళుము. నేనత్యంతకార్యాలోచ
నాసక్తుండనై యున్నవాఁడ. ఇంతదనుకను నేనీగోలలగోల
జిక్కి యెరుంగను. మంచిచెడ్డల నాలోచించనిమ్ము. (ఇంచు
క యోజించి) అబ్బా! ఆరమణీమణి యాకృతి వర్ణింప
వేయిశిరంబుల యాదిశేషునకైనను దరంబుగాదు. నాకన్ను
లలోనే యాడుచున్నది. యద్వితీయ సౌందర్యము.

ఉ. ఇలగల సుందరీమణుల నెందరినో గనుగొంటిగాని యీ
కలకలలాడు మోము కసిగందని దేహము గబ్బిగుబ్బలున్
వెలవని మోవిరంగు మరివేణియు కౌనును కన్నులంద మే
వెలదికి లేవు గాంచగను వేడ్కజనించె విధాతసృష్టికిన్.

ఈయందచందములే నాకొంప గూల్చుటకు బ్రయత్నించుచున్నవి.
కాదుకాదు. నానేత్రములే నన్ను కులభ్రష్టునిగావింప బ్రో
త్సహించుచున్నది. ఆహా? ఇంద్రియ నిగ్రహత్వము లేమిచే
తనేగదా చతుర్దశవిద్యాపారంగతులైనను సింహబలపరాక్రమ
ధీవిశారదులైనను నబలారత్నముల జూచినతోడనే పాదా
క్రాంతులగుటకు హేతుభూతము. ఛీ! తుచ్ఛసౌఖ్యముల
కాసించి స్వర్గసుఖంబులకు దూరమై పరుగిడుచున్న నీతిమాలి
న క్రోతిబోలు నామనసే నన్నింత గోతిని జేసియాడించుచున్న
ది. ఇంతమాత్రమునకే లొంగుదుననుట కల్ల.

(తెరలో మిత్రమా!)

శ్యామ—సుందరా! ఇటు

(సుందరాత్రివు-ప్రవేశము)

శ్యా—(ఆసనముజూపి) మిత్రమా! మంచిసమయమునకువచ్చినాడవు.

సుంద—(కూర్చుని)అట్లయినమేలే. కాని నీముఖచర్య వీక్షింప నీవె ద్దానిగూర్చియో మిగుల పరివేదనబొందుచున్నట్లు దోచుచున్నది! నే నెఱుఁగవచ్చునా?

శ్యామ—తప్పక.

సుంద—అట్లయిన కానిమ్ము.

శ్యామ—(సందేహము సూచించును)

సుంద—బావా! చెప్ప సందేహించుచుంటివా?

శ్యామ—(తడబడుపాటుతో) లేదులేదు.

సుంద—సరియే లేనిది లేనేలేదు. ఉన్నదిమాత్రము చెప్పుము.

శ్యామ—నీవు మొదటనే పరిహాసమునకు మొదలిడితివి. ఇంక నేచెప్పబోవుదానికి మఱెంత పరిహసింతువోయని జంకుచుంటిని.

సుంద—బావా! నాసంగతి మొదటినుండియు నీవెఱింగినదియేగదా! ఆపైన మనమిర్వురము బావమరదులు వరుసగుటచే నట్లంటిని దానికేమి చెప్పవలసిన దేదేనియున్న సందేహించక చెప్పుము. నాయోపినసాయము నేను జేసెదను.

శ్యామ—నిశ్చయముగా జేసెదవా?

సుంద—ముమ్మాటికిని.

శ్యామ—అట్లయిన వినుము.

చ. పసగల వాఁడిచూపులను బంగరురంగుల మేనిచాయలన్
మిసమిసలాడు జవ్వనము మీటిన విచ్చెడు గుబ్బచన్నులున్
రసికులు హాయిహాయి భళిరాయని మెచ్చెడు ముద్దుమోముతో
ముసిముసి నవ్వులొల్కు నవమోహినిఁగాంచితి నీళ్ళ రేవునన్.

సుంద—(తెల్లబోయి) బావా! ఎంతయుక్తిపరుఁడవు, నీవేదియో చె

ప్పెదవని నేదలంచియుండ వెర్రివానినిజేసి సన్నేయాడించ మొదలుపెట్టితివా? కాని నీవర్ణనము అనుభవశాలుర కవిత్వమును మీరియున్నదిసుమా!

శ్యామ—బావా! నిన్ను పరిహసించుటగాదు. అట్టిభువనమోహినిని గాంచితినని నీతోజెప్పుట నిన్ను పరిహసించుటా! నీసందర్భముగుమ్మడికాయలదొంగయనభుజములుతడవుకొనునట్లున్నది.

సుంద—పోనిమ్ము. చూచుటచే కన్నుల కరవుదీరిపోయెను. ఇప్పుడు వర్ణించి నాతోచెప్పుటచే నోటతుత్రిప్పసహితము వదలిపోయినది. మంచిదే, అందుల కేమందువు?

శ్యామ—ఏమందునా?

చ. పలుకులు వేయునేల విను పాటలగంధిని జూచినంతనే
యొడలెఱుగంగలేక మదనోజ్వలకీలల గ్రాగుచుంటి హా!
తెలుపగజాల నావలపు దెచ్చి రయంబున నాకుగూర్తువో
నిలువున నాదుప్రాణములు నీరజనేత్రికు ధారవోతువో!

ఎట్లు గావించినను నీయదియే భారము.

సుంద—హాయ్ హాయ్. వన్సుమోర్. (చప్పట్లుకొట్టుచు) బావా! బంగారుపతకములు బహుమానముగాగొన్న నటశేఖరులమీరిన సంగీతముతో నభినయము గావించితివే. శహబాష్. (లేచి నిలుచుండును.)

శ్యామ—సుందరా! లేచితివేల?

సుంద—ఆమెనుదెచ్చి, నీతోడ గూర్చుటకు.

శ్యామ—బావా! ఇట్టితరి, పరిహసించుట తగదుసుమా!

సుంద—నన్నొకమూర్ఖునిగాజేసి, పరిహసించుచు, పైపెచ్చు, నిన్ను పరిహసించుచుంటిననుచుంటివా! చాలుచాలు! కాకున్న పరస్త్రీవర్జితుండవని గొప్పకీర్తిగాంచిన నీవేమి, యొకస్త్రీని గా

మించుటేమి. విరుద్ధము. నమ్మజాల! నమ్మజాల! ఇదియంతయు నన్నెగతాళిజేయుటయే.

శ్యామ——సుందరా! నామాటలు సాంతముగావిని యామీదటజవాబునిమ్ము. దైవసాక్షిగా నిన్నెగతాళిజేయుటకాదు. నాకన్నులగప్పిన మోహాంధకారమే నన్నీరీతి బల్కించుచున్నది. పరసతీరతంబు పాపహేతువని నాకుదెలుసునుకాని, పట్టపగ్గములేని నామనసుయొక్క పరుగుజూచినను, నామితిలేని మోహావేశముజూచినను, నిదియంతయు, దైవాయత్తముగాదలంచి, యీపని కియ్యకొంటిని. నీవిందుల దోడ్పడి నాకు మహోపకారము గావించి తీరవలయు!

సుంద——బావా! ఇప్పటికి నిజము కనుగొనగలిగినాడ కాని ఆమెయెవరో తెలుపకున్న నేనేమి చేయువాడ?

శ్యామ——నిన్నటిదినంబు రెండుయామములవేళ నే గంగాజలంబుల స్నానమాచరించుచుండ యొకకురంగలోచ యేతెంచి స్నానమాచరించి——

గీ. కావిఛోవతి మడిగట్టి కంఠసీమ
తులసిమాలలు ధరియించి తూపులనెడి
చూపులను గుప్పి యామీద చోద్యముగను
తొలకరి మెరుపు పగిదిని దొలగిపోయె.

ఆమె వారాంగనయని నాభావము.

సుంద——(ఆలోచన నభినయించి) సరియే తెలిసినదిలెమ్ము. అదియా!

శ్యామ——(ఆతురతతో) తెలసినదా? ఎవరా మోహనాంగి?

సుంద——మనపురమందున వసియించు వారాంగన. పేరు కామకళ.

శ్యామ——(సంతోషముతో) అమ్మయ్య!

సుంద——అదేమి బావయ్యా?

శ్యామ——ఆమె నేదలంచినట్లు స్వస్త్రీయగుటవల్ల.

సుంద——అటులనేగాని అదియొక పోట్లగొడ్డు. మిాదుమిక్కిలి గత వారమునుంచి మాయింట రంకులేదన్నట్లు యీమధ్య దాని కొక వైరాగ్యభూత మావేశించినది? అందువల్ల నీకోర్కె కొనసాగునని తోచదు.

శ్యామ——నీవే యిచట ప్రత్యుత్తరమిచ్చిన నేనెట్లు యూరటబొందగ లవాడను. మనమిరువురము కలసి యామెగృహమున కరుగు దము. ఆపెయే నట్లన్న నాకు చిత్తశాంతి చేకూరును. తెలసి నదా? ఈవిషయంబున నిన్ను మిాకు అనుభవపరులు లేరు. ఈమాత్రము కార్యము చేయుట నీకొక లెక్కా?

సుంద——నిజమే. అందుల కిసుమంతయు సందియములేదు.

సీ. కోరమిాసలమిాద కుడిచేయి ద్రిప్పుచు
పెద్దసానులనెల్ల దిద్దినాడ
గణగణ వాగెడి గణికల దరిజేర్చి
పిల్లికూనలజేసి పెంచినాడ
బూతుల బుంగలౌ బోగాల గుదిగట్టి
మంచిగా మెలగంగ వంచినాడ
విఱ్ఱవీగెడి పిల్లవేశ్యల చేబట్టి
బిరికీలు గొట్టించి విడచినాడ

గీ. సర్వవేళల విటులపై స్వారిజేయు
నొక్కభూతంబు కున్నట్టి యుమ్మనంబు
వంచలేనైతి నింతయు వాంఛదీర
నదియె మనమున బాధించు నధికముగను.

శ్యామ——గుడినిమింగుహారలకు గుడిలోని లింగమడ్డువచ్చె నన్నట్లు న్నది నీసమాచారము.

సుంద——దాని పేరు దలంచుమాత్రముననే నాగుండెలు నీరగుచున్నవి నీవెటులా యని యాలోచన.

శ్యామ——నిన్నంత భయపెట్టువారెవరు ?

సుంద——(నవ్వుచు) బావా ! వినుము.

గీ. పలువురు నడచి విడచిన పాత్రిపుంత
కుళ్ళువ్రణములతోనుండు కుట్లబొంత
కంపుగొట్టెడి పడికట్టు కల్లుముంత
విటుల యెముకలు కొరికెడి వెడగుహంత
ఆతతాయి సరసులకు నడ్డుకంత
వింతవింతల జగజంత వేశ్యమాత!

శ్యామ——(నవ్వుచు) ఓహో! ఏమి నీయాశుకవిత్వము వర్ణనాతీత ముగాయున్నదే? యింతకును ముదుసలినిజూచియా నీవు జడి యుట బాగుబాగు.

సుంద——బావా ! నీకేమి తెలియును?

గీ. సాని సరసులు సంతోష సాగరమున
మునిగి దేలెడు సమయంబు ముసలిగనిన
పానకములోని పుల్లగా బయలు దేరి
నడ్డువచ్చును సంతస మంతరించ.

మరొక్కమాట-

గీ. కూతు రల్లుండు గదిలోన గూరుచున్న
తలుపుదరి జేరి ముసలిది నిలచియుండి
యొండొరుల ప్రేమ కడుమీరి యుండెనేని
సాగనంపును నావిటు చల్లగాను.

అంతియేగాని నీవు లక్షలుగురిపించినను నిన్నావృద్ధమర్కటము తన కూతుతో స్వేచ్ఛగా మెలగనిచ్చుననుట కల్ల.

గీ. ఎంత కడుపారగోరిలిన నెంతతిన్న
నెంతకాలంబు సల్పిన నేమిఫలము
యొంటిచేతితో దాహంబు పూటకూళ్ళ
తిండి లంజపొత్తు తనివి దీరబోదు.

శ్యామ—సుందరా! మన మచటికే బోవుచుంటిమిగదా అన్నిసంగతులు స్వయముగా బోధపడనుండ, నీవిట నేయుపమానము జెప్పినను నాచెవిని జొరనేరదు.

సుంద—నీకీవిషయమై నిసుమంతయు అనుభవము లేకపోవుటచే నా మాటలు దోసివేయుచుంటివి. కాకున్న నిట్లనియుండవు. ఒక్కచిన్నసంగతి చెప్పెద నాకర్ణింపుము.

గీ. ఇంట మేలైనవెన్నియో వంటకములు
సిద్ధమైయుండ వాటిని జేరబోక
నీగ దోమలతోడను సేవగించు
కాఫిహోటలుకు బరువెత్తు కరణిగాదె.

నీతొందర, నీసంగతి నిందులకు సరిగా వర్తించుచున్నది బాగుగా నాలోచించుము.

శ్యామ—ఇన్నినీతు లెరిగినవాడవు నీవేల మానకుంటివి?

సుంద—అదియా నీసందేహము అట్లయిన యాలకింపుము.

గీ. పుట్టుటాదిగ నలవడు గట్టిగుణము
మన్నెమందున తిరిగెడు మానవుండు
వేశ్యమాయల జిక్కిన విటజనంబు
మాలపల్లి మరగు కుక్క మానలేరు.

తెలసినదా, అందుచేత. ఆపైన వేశ్యమాతబెట్టు యాతన యమయాతన.

శ్యామ—నీవు నొక్కి వక్కాణించునంత విరుద్ధమా; వృద్ధవేశ్య యం దుండదని నా యభిప్రాయము.

సుంద—నీ వెన్నటికిని నట్టిదురభిప్రాయమున నుండవలదు. నేనింకను క్లుప్తము జేసి చెప్పితిని. నా స్వానుభవము—

సీ. గొంతులు గోసెడి గోహంతకులకైన
కనికారబుద్ధులు కలుగవచ్చు
నిలువెల్ల విషముండు ఖలునకునైనను
నుపకార బుద్ధులు నుండవచ్చు
ఫణిరాజు శిరముపై పాదంబు బడినను
కరువక పోవచ్చు కరుణగలుగ
జముబంట్లు సహితంబు జాలితో వేడిన
పాపుల కష్టంబు బాపవచ్చు
గీ. యముని వీటికి నరిగిన యతిథుడైన
తిరిగ రావచ్చు తనయొక్క తెలివిచేత
తిరిగి రాబోరు మిగులరు తేలబోరు
వేశ్యమాతల చేజిక్కు విటజనంబు

శ్యామ—ఓరిపిడుగా! ఎంతపద్దెము చదివినావు. యేమూలనో కూర్చుని కునికిపాట్లు పడుచుండు, వృద్ధవేశ్యయేమి యింత విరుద్ధమేమి? పిచ్చుకను జూపించి, పిడుగున నమ్మువారుందు రా?

సుంద—పిచ్చుకో చిచ్చరిపిడుగో దెలియగలదు—

ఉ. మేకల దున్నపోతులను మేలగు క్రొవ్విన కోడిపుంజులన్
మూకలుగాగ దెచ్చితమ మ్రొక్కులు దీర్చగ వేపరొట్టతో
నేకము జేసి మ్రింగుచును నేదరిగానని గ్రామదేవతే
పోకడజాలబోదు నిల బూతులబుంగకు వేశ్యమాతకున్.

సర్వకాల సర్వావస్థలయందునను,

క. తనక్షేమము తనతిండియు
తన బిడ్డలు తనధనంబు తన దేజూచున్
మన క్షేమము మనవాంఛలు
వినవొల్లడు లంజతల్లి వినరా సుమతీ!

అన్నాడు, ఎందుకన్నాడో యన్నాడు, మహానుభావుడు.

శ్యామ—(నవ్వుచు) ఇంక నీవాక్చాతుర్య కల్పనావిధాన మించుక గట్టిపెట్టుము- భోజనమునకు వేళ యతిక్రమించు చున్నది. నేడు మన మిరువురము, యిచటనే భుజింతము. అనంతరము, నీవచటికేగి యామ్ముద్దుగుమ్మతో, ముందు నారాక దెల్పుము సంజవేళ మనమిద్వరమును గలసి పోవచ్చును.

సుంద—మంచిది. అట్లనే-

శ్యామ—రమ్ము లోని కేగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర వాలును)

---

## ద్వితీయరంగము.

(మందిరము)

(తెరలేచుసరికి కామకళ పాటబాడుచు ప్రవేశము)

పాట

మతిబోయె - నీవేళ - నాదుమనంబెంతొ - గాసినొందగన్
మోహమందు-మునిగిపోతి-మూర్ఖురాలిగా ఆఆఆఆఆ ॥మతి॥
యేకరణిని-నాటుకొనిన-గాఢప్రేమ-బెరికివేతు-యేదరియును
గానరాదుగా- మోసమాయెగా- తెలియలేనుగా- దైవరాయ
దారిజూపుమా-యిపుడెనన్ను జేరి-శుభముగూర్చుమా ॥మతి॥

అబ్బా! ఆసుందరవదనారవిందు నాయేటియొడ్డున గాంచిన దాదిగ నదియేమిచిత్రమో నామనంబాతనివంకకే బరువెత్తుచున్నది.

ఉ. అన్నము నోటబోదు మన మాతనిమీదికె బారుచుండె నే
తెన్నును గానబోను మది దిట్టతనంబును వీడిపోయె గా
కెన్నడు లేనియీవలపు నీపరితాపము నెంచిచూడగా
కన్నుల దుమ్ముగొట్టనను కాముని దండ్రియె మోసగించెనా!

ఔరా! ఎట్టులాలోచింతమన్నను నామనంబునకు స్థిమితమే లేకుండబోవుటజూడ నిదియంతయు నింద్రజాలమువలెనే గన్పట్టుచున్నది. ఏకాదశియని నదికిస్నానంబునకేగ రాకాసివెంటబడినట్లునన్నీ మోహభూత మనుసరించి విడచుటలేదే! సుందరరూపుడని మనంబున భావించినంతమాత్రముననే నాచిన్నికృష్ణునకు నా హృదయంబున జోటులేకుండజేసి కలచివైచుచున్నది. ఆహా! యేమి యీమమత! యీమనోవికారము! ఈయొడలిగగుర్పాటు! అబ్బా! దేహమందంతటనుదారుణాగ్ని ప్రజ్వరిల్లుచున్నదే

పాట

ఇదేమివాంఛయో-యిదేమిమోహమో- యిదేమిమోసకృత్యమోమరేమొకో ||ఇదే||

నాదువలపు-కారణంబు- నరయలేనుగా-యేమిహేతువో- మోసంబాయె ||ఇదే||

నాదుమనసు- బిగువుజూడ- గోపబాలుడే- నిటులజేసెనా- నేరజాల ||ఇదే||

ఆహా! ఆసుకుమారగాత్రుడు నేడు దర్శనమిచ్చి మద్గృహంబు పావనముజేయునని సుందరాంగివు చెప్పినప్పటినుండియు క్షణమొకయుగములాగున నున్నయది (శిరము పంకించుచు) ఎన్నడును

లేని నాయీమార్పులుజూడ యశరీరమాణి చెప్పనటులనే జరిగి తీరునని దోచుచున్నది (ముందుకుచూచి) అల్లదే వారలు వచ్చుచున్నారు. ఆహా, యేమిసోయగము.

(హిందూస్తానిమట్టు-బటువాకుందన తైరేమెలని యావలె)

మరుడేయెంచగ- మహానుభావుడు- మరుడేయెంచగనూ
కన్నులవికల్ వలుగా-సరిడువయసు-సనుబాలింపగనూ ॥మరు॥
తరుణులుగనినా-సలాములిడరే-వావా వగకాడే
మీసహాయలెన్నంగ పసందుయగుగా-మెపరీక్షితనితో ॥మరు॥
నాకసుంగువాడే-ముదంబుగూర్ప-మరిమరిసుకుమారే
వహ్వా! యికనేమందూ-హుషారిసఖు-దూమసనేలాగెడుగా॥మరు॥

(శ్యామసుందరమూర్తిసుందర్రావుప్రవేశించికొంతదూరమునసిలతురు)

శ్యామ—(చూచి) సుందరా!

సాంగు

ఆహావయ్యారీయిదే-చెలీయిదే
వహ్వావహ్వాసఖిగూడీ-రతులాదేలెదా హాఆఆఆ ॥ఆహా॥
లేమానుజూడా-నామానసంబు- తత్తారామొందుచుండె- సొంపౌ
మెరామమోము-సోద్యామీదేదీనిగాంచ హాఆఆఆఆ ॥ఆహా॥
గిల్లీనదీని-పాల్గారునాట్టి-లేతామొగ్గనుబోలూ- బంగారూ సుంద
రాంగి-దక్కేని దేతాళజాలా హాఆఆఆఆ ॥ఆహా॥

సుందరా! నీవుపోయి నాయాగమన మామె కెరింగింపుము.

కామ—(ముఖమువంచి నిలచుండును.)

సుంద—(ముందునకువచ్చి) కామకళా! చూచియు చూడనట్లు మెలంగుట నీబోంట్లకు బాడియే?

కామ(తలపైకెత్తి) అయ్యో! ఆయాయాసనముల నుపవిష్టులుగండు.

సుంద—(ఒకయాసనముపై గూర్చుని) మిత్రమా! యిటువచ్చి గూర్చుండుము.

శ్యామ—(వచ్చి యాసనము నధిష్టించును)

కామ—(ప్రవేశించి చేతులుజోడించి)

గీ. భూసురోత్తమ మీయొక్క మోముగాంచ
బ్రహ్మతేజంబుతోడను వరలుచుండె
పాపచయమెల్ల నన్నుండి బాసిపోవ
వందనంబుల నిడుచుంటి వరము లిడుమ.

(నమస్కరించును.)

శ్యామ—(కామకళశిరముపై హస్తముంచి)

సీ. శ్రీరాగమునగూడి చింతలబోకార్చి
ముదమొదవించును ముద్దుగుమ్మ
కళ్యాణి నీకీర్తి కలకాల మిలయందు
వెలయింప కృష్ణుండు నిలచియుండు
శంకరాభరణంబు సంతసమేపార
వాగ్విభూతు లొసంగు వాడు నీకు
మోహనాంగిరో నీకు మోక్షంబు సమకూర్చు
శ్రీమహావిష్ణు వచింత్యముగను
గీ. దేవగంధర్వు లాదియౌ దివ్యసతులు
నీకు నివ్వాళులిత్తురె నీరజాక్షి!
శ్యామసుందరమూర్తియే సంతసమున
నిన్ను చేపట్టనుండెను నిజముకొమ్మ!

సుంద—తథాస్తు.

కామ—ఆర్యా! ఆశ్యామసుందరమూర్తి కరుణచేతనేగదా భవదీయ దర్శనభాగ్యము లభించి నేగృతార్థురాలనైతిని.

సుంద—(శ్యామసుందరుని జూపించుచు) ఈతని నామధేయమును శ్యామసుందరుడే యగుటవల్ల, నీపరిత్యక్త దైవముగా పూజింపవచ్చును.

కామ—(తనలో) హృదయమా! తొందరపడకుము. (ప్రకాశముగా) అట్లయిన భవదీయాశీర్వచనము విఫలమాయెనే-

శ్యామ—(తొట్రుపాటుతో) ఎందువలన?

కామ—(తనలో) నాపై నీతని కెంతయనురాగమున్నదో నే తెలిసికొనునందాకను నాప్రేమను వెల్లడింపరాదు (ప్రకాశముగా) కట్టకడపటి పాదములు రెండును తిరుగా జదువుడు.

శ్యామ—అందుల నేదేని దోషముండెనా?

కామ—దోషములేదు. కాని అందలి శ్లేష విశదీకరించెదను.

శ్యామ—అట్లయిన వినుము.

గీ. శ్యామసుందరమూర్తియే సంతసమున
నిన్ను చేపట్టనుండెను నిజము కొమ్మ.

అని యాశీర్వదించితి.

కామ—ఆశ్యామసుందరమూర్తి యెవరు?

శ్యామ—నీవేరినిదలంచిన వారే.

కామ—అట్లనా, అట్లయినచో మీకోరికలు సిద్ధింపజాలవు.

శ్యామ—తప్పక సిద్ధించుననియే నాయూహ.

కామ—కాకున్న?

శ్యామ—నాదురదృష్టము—

సుంద—(లేచి) బావా! నాకవ్వల తొందరపని యున్నది. నే బోయి వచ్చెదను.

శ్యామ—నేనును వచ్చెదను. వచ్చినపని వాకిటనే యైనదిగదా?

సుంద—(చెవిలో నేదియోచెప్పి) కామకళా! అన్నియును దెలిసినదా.
నవు. నీకు నే నేమియు చెప్పజాలను. (లేచి వెడలబోవును)
కామ—స్వామీ! తాంబూలము స్వీకరించుడు(తాంబూలము నిచ్చును)
సుంద—(గ్రహించి) వాంఛాఫలసిద్ధిరస్తు (నిష్క్రమించును)
కామ—(శ్యామసుందరుని జూచి) మహాత్మా! ఇంతమాత్రమున కే దురదృష్టమా?
శ్యామ—కాంతామణీ! మనుజుడు మనసార వాంఛించు కార్యము సఫలతనొందకున్న నది యాతని దురదృష్టముగాక మరేమి?
కామ—యిందు మీరు పొరబడుచుంటిరి ఇది తప్పక మీయదృష్ట ముగా భావింపుడు.
శ్యామ—ఎందువలన?
కామ—ఇట్టి నీచకోరిక కొనసాగకుండుటచే.
శ్యామ—ఏమీ! యీనాకోరిక నీచమా?
కామ—నీచమేగాదు అతినీచము.

ఉ. భూరితపోధనుండ! తలపోయగ జెల్లునటయ్య వైదికా
చారములెల్ల మాని బహు శాస్త్రపురాణ పరిశ్రమంబు కా
సారమునందు గల్పి వెల సానుల జేరగ వచ్చుటయ్యయో!
ఘోరము పాపపంకిలము గొల్లున నేడ్వరె యాలుబిడ్డలున్.

శ్యామ—(తనలో) ఔరా! వేశ్యయయ్యును నీతిబోధనల సలుపుట జూడ వింతగొల్పుచున్నదే! నాకు వీరలతో నిసుమంతయు పరిచయములేకుండుటచే నీమె మనోభావము గ్రహింపనలవి గాకున్నది. ఇదియంతయు నన్నధిక్షేపించుటా లేక నిజమైన నీతిబోధయా? (ప్రకాశముగా) నారీమణీ, వేశ్యనగుటచేతనే యాచారము లడుగంటిపోయి ఆలుబిడ్డ లేడ్తురా? నీ మాటలు నమ్మయుక్తము గాకున్నవి.

కామ—భూసురాగ్రిణి! వేశ్యాసాంగత్యమన వ్యభిచారదోషమువల్ల
కీడుమూడునని నాభావము.

శ్యామ—సుందరీ! కన్నులు తెరచి వర్తించువానికి యేకార్యమందు
నను దొసగు రానేరదు మితముగాక యమితమైనచో నీవన్న
దిసత్యమేకావచ్చు.

కామ—అయ్యయో! మీరే యట్లు నడిపినచో నేనేమనుదానను
అగ్ని హోత్రిములో నురుకు వానికికన్నులు దెరచిన భస్మము
కాకబోవుటయు కన్నులుమూసిన భస్మమగుటయుగలుగునా.
ఏమీ మీవెఱ్ఱి?

సీ. సంసారవృక్షంబు సమయించు పరశువు
వ్యభిచారభూతంబు పండితుండ
పుణ్యాబ్ధినింకించ పుట్టిన బడబాగ్ని
వ్యభిచారభూతంబు వైదికుండ
జ్ఞానతేజంబును గప్పెడు మేఘంబు
వ్యభిచారభూతంబు భాసురాంగ
ఇంద్రియంబులకెల్ల నెగబ్రాకు చెదపుట్ట
వ్యభిచారభూతంబు పరమపూజ్య

గీ. నిహపరంబుల రెంటికి నెడము జేయు
కుళ్ళువ్రణములలో ముంచి గుంద జేయు
సర్వసుఖములు మొదలంట జంపివేయు
వలదు వ్యభిచారభూతంబు వలనుదగుల.

కామపీడితులై పరాంగనలపొత్తునభిలషించువారలకు కష్టములుచేకూ
రునని చెప్పెడి పెద్దలవాక్యములు వినరే? మరియు త్వదీయేప్సి
తంబు నెరవేర్చున్నంతటి జాణనుగాను నన్నలయింపక మీని
వాసంబుల కరుగుడు.

శ్యామ.—ఆహాహా!

క. సలలితముగ మశకంబులు
కలభంబుల మ్రింగగల్గు కాలములందున్
కులకాంతల ధర్మంబులు
వెలకాంతలు జూపిరేని వేడుకగలుగున్.

మరొక్కసంగతి—

చం. వలపులుజూపకే వలచి వచ్చినవారల నాదరింపకే
కలకలనవ్వకే జిగిని గారపుమోవిని పంటికియ్యకే
కులుకు పసిండిగుబ్బలను గొబ్బున నాయురమందు గ్రుమ్మకే
వెలది యిదేమి పొమ్మనెదు వేలను గుంజెడి కోపడంతివై.
పైపెచ్చు నేరనివానికి జెప్పినట్లు హితములు గరపుచుంటివే.

బాగుబాగు.

కామ—భూసురోత్తమా! వేశ్యయైననేమి మరొకరైననేమి కులముతో ప్రసక్తియేల గుణమే ప్రధానముగాని వ్యభిచరించుట దోసమని నామనస్సు నేనమ్మియుంటచే నికార్యంబు మీవంటి మహాపురుషులకు తగనిదని మనవిచేసితినిగాని తమకు నీతు లుపదేశించునంతటి జ్ఞానము నాకెచటినుండియలవడును.

శ్యామ—(విసుగుతో) అట్లయిననిప్పుడేమందువు?

కామ—దేవా! నాపలుకులకు తమరాగ్రహపరవశు లగుచుంటిరని నే నూహించుదాన.

శ్యామ—ఆగ్రహమే నన్నిట కీడ్చుకొనివచ్చుటచే వచ్చినాడ. నీగృహంబుజొచ్చియు నీపై గినియువాడనే?

కామ—ఏగ్రహము మిమ్మిటకు దోడ్తెచ్చినది?

శ్యామ—కామగ్రహము.

కామ—పుణ్యపురుషా! మీరు వేయిపోకడలబోయినను శాశ్వతానం

దముసుఁగూర్చి శ్రీకృష్ణపరమాత్మకు తావొసగిన నాహృదయ మునందు పెరవార్లకు జోటిచ్చి తుచ్ఛసుఖంబుల నభిలషించు దానను గాను. మీరును మీభావోద్రేకమును మరల్ప వేడెద.

శ్యామ—వారనారీమణీ! అది నావలన కానేరదు. ఈనిముషముదను కను స్త్రీసంపర్కమున నెట్టిదో యెఱుగని యస్ఖలితబ్రహ్మ చారుడను అట్టివానికి నేడీగతి బట్టుట దైవికముగా భావించి నన్నాదరింపుము.

కామ—మీరేనా యస్ఖలితబ్రహ్మచారులు. ఆహాహా!

శ్యామ—దైవసాక్షిగా ఆనాడు మీవారికుచద్వయంబుజూచి శృంగ ద్వయంబుగా భావించిన ఋష్యశృంగుడే నాకన్న వేయిరెట్లు యధికంబు.

కామ—అనుభవశాలురమించి పల్కుచుండియు నేమియు నేరనట్లు కల్లలాడిన దోసముగాదా?

శ్యామ—కల్లలాడిన దోసమేగాదు. నరకము సంప్రాప్తించును. భో జనిముఖకమలంబు వీక్షించినంతనే కవిత్వమలవడినట్లు నీవద నాంబుజంబును జూచినంతనే నాకీపలుకు లలవడుచున్నవి.

కామ—(తల పంకించుచు చిరునవ్వు సూచించును)

శ్యామ—సుందరీ! నవ్వుచుంటివేల?

కామ—మేరలేని మీవాక్చాతుర్యమునకు నవ్వువచ్చుచున్నది.

శ్యామ—ఔను పిచ్చివారలజూచి లోకులునవ్వుట సహజమే. ఇందు నీతప్పులేదు (పైకిజూచుచు) ఓరిదోరిహి! ఎంతపనిజేసితివిరా. పరమనిష్ఠాగరిష్టుండనై యెటనో గూర్చుండి తపమాచరించు చుండ బోరిత్సాహపెట్టి మూలనున్నవానిని బయటికీడ్చి బల్వంతల బెట్టుచుంటివిగదరా. ఏమి నీమహిమంబు?

కామ—మహాత్మా! సుభద్రావే యిటులజేసెనా?

శ్యామ—కాదు.

కామ—కాకున్న మరెవరు?

శ్యామ—ఎవరా!

చ. వలదని జెప్పుచుండ తగు భామను గూర్చెదనంచు మన్మథుం
డెలమిని నాదుమానసము నెట్టులొ డొంగిలి బాతిపెట్టె నో
చిలుకలకొల్కి! నీహృదయ సీమను చూడుము యచ్చటచ్చటన్
తెలియగలేనిచో వెదకి తేల్చెద దేలెద మోహవారధిన్.

(పట్టుకొనబోవును)

కామ—(వెనుకకుతగ్గి తనలో) యీతడే యశరీరవాణిచెప్పిన పురుషుండు. నేనింక నీతని వేసటబెట్టిన పాపమగును. (ప్రకాశముగా) సుందరాకారా! ఒక్కసంగతి.

ఉ. భూమిని భామినీమణుల భూరివిలాసము జూచినంతనే
కాముని బారిజిక్కి తమకంబున కన్నులుగానకుండగా
వేమరు దేవులాడి కడుప్రేమలజూపుచు కాళ్లుబట్టి యా
కామితమెల్ల దీరగనె కంటను జూడరు పూరుషావళుల్.

కావున మగవారిని నమ్మరాదు.

శ్యామ—చెలీ! అందరు నట్లేయుందురా?

కామ—ఆర్యా! ఇంతకుముందు తామేదియో శెలవిచ్చియుంటిరి. జ్ఞాపకమున్నదా?

శ్యామ—అదెట్టిదియో నీవే పేర్కొనుము.

కామ—వేశ్యజాతిలోబుట్టియు మొగమోటములేక ప్రసంగించుచుంటినని వాకొంటిరే. వేశ్యకులమున బుట్టినంతమాత్రముననే మీరు నన్నగ్గించతగునా?

శ్యామ—అట్లయిన మనమిరువురము సమానులమే.

కామ—దానికేమిగాని,

చ. వినయవిశారదుండవు వివేకముగల్గిన బుద్ధిమంతుడా
ఘనుడవు భూసురాగ్రణివి గాక మనోహరమూర్తి వెంతయున్
అనయము నన్నువీడనని యాదరమొప్పగ బాసజేసినన్
మనమున చింతవీడి యనుమానములేకను కేలుపట్టెదన్.

శ్యామ—చెలీ! అట్టులనే జేసెదనుగాని, యింతమాత్రిపుపనికై న న్నెంతశ్రమపెట్టితివి? నీవు గంగలో నురుకుమన్నను నురుకుటకు సిద్ధముగా నున్నాడను.

కామ—అంతటి మూర్ఖురాలనుగాను. బాసజేసిన చాలును.

శ్యామ—ప్రియా! బాసజేసి పిదప మోసగించినచో నీవేమిచేయుదానవు?

కామ—ఆపాపంబుల తామే నశించుతురు. మీరట్టి తరగతిలో జేరరని నాగట్టినమ్మకము. అందువలననే మీరు బాసజేసినచాలునంటి—

శ్యామ—ముద్దుగుమ్మా! ఇదిగో వినుము.

ఉ. పంకజగంధిరో! వినుము ప్రాణపదంబుగ జూచుచున్ సదా
బొంకను మాటలేక నిల బొందిని ప్రాణము లుండుదాక నే
శంకల ముంచకుండ నెరజవ్వనమంతయు పట్టిపోయినన్
శంకరుసాక్షిగా విడను సందియమొందక కౌగలింపుమా.

(కరములు ముందుకు సాచును)

కామ—(పూలహారము మెడలోవైచి నమస్కరించును)

శ్యామ—(వేరొక పూలహారమువైచి ముద్దుగొనును)

కామ—(తప్పించుకొని) నాథా! మీరామదనునిబారి జిక్కుటయే గాక, పైపెచ్చు నన్నుగూడ మిమ్మనుసరింపజేసినారు.

శ్యామ—చెలీ? వాడిమహిమంబట్టిది. శతవృద్ధులసహితము నాడించు వానికి యావనారంభులము మనమెంత? (పైకిచూచును.)

కామ—నాథా! అటుల చూచుచుంటి రేల?

శ్యామ—

ఉ. అల్లదె చూడుమా రమణి నారయకుంటిమి మాట్లసందడిన్
చల్లగ జారిపోయె నిశి చంద్రుఁడు వెల్వెలబారజొచ్చె నో
ఫుల్లసరోజనేత్ర విను పూవిలుకాడును సంతసింప నీ
యుల్లము పల్లవింప మదనోజ్వలతాపము దీర్తు రమ్మికన్.

ఆలస్యము వలదు రమ్ము పోదము.

(ఒండొరులు కరములు గ్రహించి నిష్క్రమింతురు.)

(అవనిక జారును.)

---

## తృతీయరంగము.

హేమకళ భవనము,

(తెరలేచుసరికి హేమకళ పాడుచు ప్రవేశించును.)

పాట.

నను గాంచి-సరసులూ-ఘనమోహ-మును జెంద-బోరె-బోరె॥ నను
అలనాటి-మోహినీ-యవతార-మును మీరి-లేనె-లేనె॥ నను॥
ఏవారి-కుండెగా-నాయంద-చందాము-షోకు-షోకు॥ నను॥

(ఒకయాసనమున గూర్చుండి) మాయక్క మాటలు విన్నచో నేనెంత మోసపోయియుందును. కూటికిని గుడ్డకును మొగమువాచి యుందునుగదా. ఇప్పుడు నాకేలోటును లేక హాయిగా కాలము బుచ్చుచుంటిని. నన్నిమెపెంచుకొన్నను కడుపున గన్నకూతురుకన్న కడుగారాబమున చూచుచు ప్రేమించుచున్నది. నేపుట్టినది యొకనీచకులమైనను నేనీగృహంబున బడుటచే యే విచారమును లేక నిత్యానందమున నోలలాడుటకు కారణమైనది. నా

కన్న తల్లివద్దనేయున్నచో నాకీసౌఖ్యములును యీచీనిచీనాంబరములును యీనగలును వచ్చునా? ఎన్నటికిని రావు. మీదుమిక్కిలి ఏమోటవానినోపరిణయమాడి కూలినాలి జేసి జీవింపవలసి వచ్చెడిగి. పాపము సుందరాౠవు నన్ననుసరించియుండి నాయడుగులకు మడుగులొగ్గుచు ప్రతిదినంబునను యెవనినో యొకనినిదెచ్చి నాకంటగట్టి కనకవర్షము గురిపించుచున్నాడు. మాయమ్మ యాలోచనప్రకారము యీతడు నాకు మహోపకారి యయ్యెను.

(తెరలో చిన్నమ్మాయిగారండీ! సుందరాౠవు నిన్నటిదినమున శ్యామసుందరమూర్తిని మీ యక్కయ్యకు తార్చినాడట)

హేమ—నీ కెవరు చెప్పిరి?

(తెరలో మనప్రక్కయింటి నీలాచలము చూచినదట)

హేమ—సరే! నీపని నీవు చూచుకొనుము. వాడు వచ్చినపిదప వానిపని బట్టెదను. (తనలో) ఔరా! వీనికి పోగాల మాసన్నమయ్యెను కాబోలు. నావద్దకువచ్చెడుసరసులు తెచ్చిన తినుబండములు తినుటచే మదమెక్కి కనులుపొరగప్పినట్లున్నది. వీడు నాకేమియు యివ్వకపోయినను నాగుమ్మమువద్దకు రానిచ్చుటవల్ల నాకే పంగనామములా? కానిమ్ము. నేటితో యీపీనుగను యీడ్చివేసెదగాక. యీచచ్చునాగమ్మ కట్టెడి కుళ్ళుగుడ్డలు చూడలేక మొన్ననేకదా మాతల్లి కన్నులలోదుమ్ముగొట్టి పాతిక రూప్యముల వెలగలయుడుపులు గుట్టించితెని. ఆవిశ్వాసమైనను లేకపోయెనే (అడుగులుచప్పుడు వినబడముందుకుచూచి) అడుగో! శవాలరాయడువచ్చుచున్నాడు. (ముఖమువంచి కూర్చుండును.)

(సుందరారావు ప్రవేశము.)

సుంద—(హేమవంకజూచి తనలో) ముఖమందు తీవ్రక్రోధలక్షణములు తాండవమాడుచున్నవే. కారణమేమైయుండును. శ్యామసుందరుని నేనటకు తోడుకొనిపోయినసంగతి తెలిసినదాయేమి? ఎట్లు తెలియును? నాభయముచే నేననుమానపడుటయేగాని దీనికి కారణము మరొక్కటియుండవచ్చు. (యోచించి) ఓహో! నిన్నటిరాత్రి నేనిటకు రానందులకేయీకోపము. పిచ్చిముండ (సమీపించి) ఒరే నాన్నా!

హేమ—(కోపముతో) ఛీ! అవతలకుబొమ్ము.

సుంద—అబ్బా! ఇదియంతయు కోపమేనా?

హేమ—కోపమేగాదు. దారుణక్రోధాగ్ని. ఈక్రోధాగ్నికి నిన్నాహుతి జేయకుండ చల్లారదని యెరుంగుము.

సుంద—(నవ్వుచు)

గీ. కారణములేక నీవు యకారణముగ
కోపగించిన నేమందు కోమలాంగి!
కాకగలిగిన నునుబట్టి కౌగలించు
చప్ప చల్లారిబోవు నాజ్వాల బాల.

ఎందుకురా నాపై నీకింత యకారణాగ్రహము?

హేమ—(లేచి జుత్తుపట్టుకొని) ఏమంటివి. అకారణాగ్రహమా? నిన్నటిరాత్రి నీవిటరాకుండ నెటజచ్చితివి?

సుంద—(తనలో) నేదలంచినదే నిక్కవంబు. నేనొక్క నిముసము గాన్పింపకున్నచో నాకై పరితపించుననుట వాస్తవమే.

హేమ—మాట్లాడవేమి! తగినసమాధానముకొరకు వెదకుచుంటివా?

సుంద—(తనలో) నేనిప్పుడు పెద్దబొంకు.బొంకకున్నచో మాట దక్కదు. (ప్రకాశముగా)

గీ. తండ్రిగారిది నిన్నను తద్దినంబు
చుట్టపక్కము లెందరో చుట్టుకొనుట
నిన్ను దర్శింపలేనైతి నీరజాక్షి!
నమ్మనామాట నీతోడు నమ్మగాదు.

హేమ—(జుత్తువదలి కొంచముతొలగి) ఏమీ! నాసొమ్ము తినుచుండి యు పైపెచ్చు నాపై నోట్టుబెట్టి యబద్ధములాడుచుంటివా? ఛీ, ఛండాలుడా?

సుంద—(దీనముగ) హేమా? నీవట్లు బలికిన నే నేమనువాడను.

హేమ—ఛీ! నోరుమూయుము. అధికముగాప్రసంగించినపండ్లూడును

సుంద—(నవ్వుచు) హేమా! ఆశపెట్టుటచే లాభము లేదు.

హేమ—ఓరీ! దుర్మార్గుడా! నిన్నటిదినమున శ్యామసుందరుని యెవరికి తార్చితివి?

సుంద—(తెల్లబోయి ధైర్యము తెచ్చుకొనునట్లభినయించుచు) రామ రామ! నేనాతని నెవరితోడను గూర్చలేదు. అతనితో మాత్రం మీయక్క గృహంబున కేగినమాట వాస్తవము.

హేమ—(బుగ్గలుపట్టి నులుముచు) నిన్నటిదినమున నీతండ్రితద్దినమని యేడ్చితివిగాదా ?

సుంద—తద్దినవిధి దీర్చినతదుపరియే నేనాతనినితో గూడ నేగినాడ.

హేమ—నాసవతియింటికి నిన్ను వెళ్ళవలదని నీకు ఖండితముగా చెప్పి యుంటినా లేదా?

సుంద—నాస్నేహితునిమాట తీసివేయలేకపోయితిని.

హేమ—అవును నాకన్న వారు నీకెక్కుడుమిత్రులు.

సీ. మాతల్లి కండ్లలో మట్టిగొట్టియు నీకు
యుడుపులు కుట్టించి యొసగలేదె

సరసులు రానట్టి శనిరోజులందున
సరసంబు నీతోడ సలుపలేదె
వారంటుబంటొత్రితు పలుసార్లు బట్టగా
బ్రతిమాలి వానిని బంపలేదె.
చావుకు సిద్ధమై సంధించినప్పుడు
వైద్యంబుచేయించ బ్రతుకలేదె

గీ. తిండిలేకుండ మాడెడు దినములందు
పొట్టపగులంగ బువ్వను బెట్టలేదె
ఇన్నిచేసినదానికా యింతఫలము
ఔర! నేమందు నీచర్య లద్భుతంబు.

కావున యీనిమిషమునుండి నాయింటికి రావలదు. ఆతనితోడనే యుండుము. పొమ్ము.

సుంద — నీకన్న తక్కువతిన్న గాడిద యెవడు?

సీ. సరసులతో నీవు శయ్యపై బవళించ
పహరా టలాయించి వరలలేదె
చాకలిరానట్టి సమయంబులందున
గుడ్డలు నీయింట గుంజలేదె
మగరూపు దాల్పించి మగలయిండ్లకునిన్ను
దరలించుకొనిపోయి తార్చలేదె
నీయిల్లు రతులకు నిలయంబు జేసిన
ప్రముఖుడీ డాఫరుబావగాదె

గీ. మందువేసగినందున మిండకాండ్రి
వచ్చివెడలిన పిమ్మట వాంఛలుడిగి
యున్నుబున్నువేళల నోర్పుబూని

విసనకర్రైను చేబూని విసరలేదె
విసుగుజెందక నీకాళ్ళు పిసుగలేదె.

నేనుమాత్రం నీవిషయమై కష్టపడుటలేదాయేమి? బాగుగ నాలోచింపుము. నాసర్వస్వము నీవేయని దలంచి నీపంచనుజేరి నీకనుకూలవర్తనుడనై నాకీ పుర జను లిడిన "డాఫర్" బిరుదంబును సార్థకపడునట్లు వర్తింపుచుండ నన్ను పొమ్మందువా? నాకింక గతియేది? అమ్మయ్యో! నిన్నువిడచి యొక్కనిముసమైన బ్రతుకగలనా? కావున యీశిక్షమార్చి నీసన్నిధినుండునటుల యేకఠినదండన విధించినను సంతసముతో. ననుభవించెద. (చేతులు జోడించును)

హేమ—మొండిపీనుగవు. నీకు యెగ్గా సిగ్గా. అన్నిటికిని తెగించియున్నావు.

(కల్లులొట్టితో కల్లుగంగయ్య ప్రవేశము)

గంగ—(కల్లులొట్టిదింపి) చుందరయ్యగారూ? మొన్నతోటలోకొచ్చి పుచ్చుకున్న కల్లుకి డబ్బులు యివ్వారాయేమి?

సుంద—యిచ్చెదనులే.

గంగ—(హేమనుజూచి) పిల్లా! నీతల్లి యేది?

హేమ—లోపలయున్నది. పిలుచుకొనివచ్చెద కూర్చుండుము.(లోనికేగి తిరుగా నరహరితో బ్రవేశించును.)

నర—గంగయ్యా! ఇంత పొద్దెక్కినదేమి?

గంగ—యియాల చనితయోాదసంటగాదా. యేటికెల్లి తానమాడి వొచ్చేసరికి పొద్దెక్కింది.

నర—మంచిదేమైన యున్నదా?

గంగ—పోతుతాడిది. ఏసుకుసూడు. తమాసా తెలుత్తుంది,

నర—అమ్మాయి! గ్లాసు తీసుకొనిరమ్ము.

హేమ—(పోయి గ్లాసు తెచ్చును)

(గంగయ్య గ్లాసులో పోయును నరహరి త్రాగును.)

గంగ—ఎల్లాగుంది?

నర—బాగానేయున్నది. అమ్మాయీ! నీవొకగ్లాసు త్రాగుము. నీ కండ్లు మెరుపుతగ్గును.

గంగ—యేడికి మంచిదే ఏసుకో ఒక్కగళాసు

(గ్లాసులో పోయును హేమ త్రాగును.)

సుంద—(చూచుచుండును.)

నర—(సుందరావువంక జూచి) చూడనక్కరలేదు. నీకివ్వకుండా మేము త్రాగిన మాకు యిమడనే యిమడదు. గంగయ్యా! ఈశ్రాద్ధాలగద్దకుకూడా కానిమ్ము.

సుంద—వలదు వలదు.

గంగ—బెట్టుసరెందుకేంటి తాగవయ్యా!

(గంగయ్య పొయ్యగా సుందరావు త్రాగును)

నర—సుందరం! అల్లరిచేసినా కక్కినా పీకినొక్కేదను, జాగ్రత్త.

గంగ—(నరహరితో) చాలునా?

నర—అప్పుడే, ఇంకొకసారి వరసతిప్పవోయి.

(గంగయ్యపొయ్యగా ముువ్వురును త్రాగుదురు)

నర—(మత్తెక్కిపడిపోయి) ఒరే సుందరం. కడుపులో తిప్పుచున్నది చప్పునవెళ్ళి వంటయింటిలోనున్న నంజుడుదీసికొనిరమ్ము.

సుంద—(మాటాడక కూర్చుండును,)

నర—ఏమిరా కదలవు? మొద్దులాగ. (తన్నబోవును.)

హేమ—అమ్మా! ఏమిటా చేష్టలు?

నర—చువర్! మాటాడకు. మాటాడితే. సంపుతా. గంగయ్యా! ఇంకో ఓఓఓ (పడిపోవును)

హేమ—గంగయ్యా! నీవువెళ్ళుము రేపటిరోజునడబ్బులుయిచ్చెదను.
గంగ—రూపాయిపావలా అయింది. మర్చిపోకు. (నిష్క్రమించును,)
హేమ—సుందరా! వీధితలుపు గడియవేసివచ్చెద చూచుచుండుము.
(నిష్క్రమించును.)
సుంద—వెలయాలిని గూడుటేతప్పు. అందులో ధనములేక దానికూటికాసించి దానిపంచల దిరుగువారలకు యింతకంటె నెక్కుడు సుఖముండునా? కానిమ్ము. సమయమువచ్చినప్పుడు నొక్కివేసి కాళ్ళు బట్టించితీరెద.
హేమ—(ప్రవేశించి) సుందరా! పట్టుము.
సుం—(తెల్లబోయి వణకుచు తనలో) నామాట దీనిచెవిని బడినట్లున్నది.
హేమ—నీకేమయిన దయ్యము పట్టినదా యేమి? అటుల జూచుచున్నావు. (కనుసైగజేసి) పట్టెదవా లేదా?
సుం—(జడియుచు హేమకాళ్ళపై బడును.)
హేమ—(నవ్వుచు) ఓరిపిీనుగా! నాకాళ్ళుగాదు. మూతల్లిని మోయుమని చెప్పితిని.
సుం—(సంతోషముతో) అట్లనా! అయినచో సరియే.
(సుందరావు కాళ్ళును హేమ తలయుబట్టి సరహారిని లోనకు మోసికొని పోవుదురు)

(తెర వాలును)

ఇదిచతుర్థాంకము.



శ్రీపరమేశ్వ రార్పణమస్తు.

# కామకళ

పంచమాంకము.

—

## ప్రథమరంగము.

(కామకళ భవనమున ముంగలిచావడి.)

(తెరలేచుసరికి కామకళ శ్రీకృష్ణవిగ్రహమునకు పూలహారము లలంకరించుచుండును.)

(అనంతరము లోనికేగి పళ్ళెరముతో పుష్పములు హారతిగై కొనివచ్చి పూజసలిపి)

సీ. పూవుల బూజింప మోహమైన జూపవు
మనసున నేముండె మాధవుండ!
పిలచినపలుకవు ప్రియమును గూర్పవు
నామీద కోపమా నళిననాభ!
సయ్యాటలాడవు సంతసమేపార
నేచేయు పాపమా నీరజాక్ష!
భక్తితో వేడంగ భయముల దీర్పవు
మరియాదయా నీకు మానిచంద్ర!
గీ. సానె యంచును మది నెంచి సారసాక్ష!
పక్షపాతము బూనుట పాడిగాదు
దాసురాలిని నామీద దయను జూపి
నన్ను నీలోన జేర్పుమా సన్నుతాంగ!

(పద్యము పాడుచుండగనే శ్యామసుందరమూర్తి యొకమూటతో ప్రవేశించి నిలుచుండును)

కామ—(పూజానంతరము శ్యామసుందరునిజూచి) నాథా! వచ్చితిరే? (ఆసనముజూపి) ఇందుదయచేయుడు.

శ్యామ—(మూటపక్కనయుంచి కూర్చుండును.)

కామ—(పళ్ళెరమొండుదెచ్చి భర్తపాదములందుంచి జలంబుల కడిగి పూలపూజించి నమస్కరించి తీర్థంబు శిరంబున జల్లుకొని లేచి) ఆర్యా! నేడింత యాలసించితి రేల?

శ్యామ—ప్రియా! నేడు శనిత్రయోదశి యగుటవల్ల శివాలయంబున కేగిమహేశ్వరున కభిషేకము గావించివచ్చుసరికి తడవయ్యెను.

కామ—నాథా! మీరు కడుధన్యులు కానినేడు రేపు యన్న విచక్షణ మన కేల?

గీ. హృదయ పీఠమునందున పదిలముగను
కృష్ణభగవాను సుందరాకృతిని నిల్పి
సర్వవేళల నర్చించు సాధుమతికి
నేడు రేపన్న భేదంబు లుండునొక్కొ?

శ్యామ—నీవు వచించినది యదార్థమేగానియొక్కొక్క దిన మొకరికి బ్రీతియని శాస్త్రము లుద్ఘోషించుటచే నేనటుల జెప్పినాడ!

కామ—అటులయినచో ప్రీతికానట్టి దినమందున వేడిన యెడ భగవంతుడు వరము లొసంగడే?

శ్యామ—అటులెన్నటికిని దలంచవలదు. తనభక్తులకెల్ల వేళలయందు వరములొసంగుచుండును దీనిని గ్రహించుము. (మూట యిచ్చును)

కామ—(గ్రహించి) నాథా! యిందేమియున్నది?

శ్యామ—విప్పి చూడుము. ముంజేతికంకణమున కద్దమేల?

కాము—(మూటవిప్పి నివ్వెరపడి) నాథా! ఇవి యేల తెచ్చితిరి? ఎందులకు? ఎవరికొరకు?

శ్యా—దేవీ! నీకొరకే దెచ్చినాడను.

గీ. తులసిమాలలు ధరియించి విలువలేని
కావిగుడ్డలు గట్టుట గాంచలేక
రత్నభూషలు చీనాంబరములు నీకు
దెచ్చియున్నాడ కలికిరో తెలియలేవె?

కామ—మహాభాగా! ఏమి మీావెఱ్ఱి?

సీ. భూషలు ధరియింప బుద్ధిని బోగొట్టు
గర్వంబు తలకెక్కి కామియగును
తులసిమాలలు వేయ తొలగును పాపంబు
గర్వముడిగి మోక్షకామియగును
కాంచనచేలంబు కన్నులు పొరగప్ప
నర్వేశు జూడంగ సాధ్యపడదు
కాషాయవస్త్రంబు కామిత ఫలమిచ్చి
మోక్షంబు చేకూర్చు మోదమొదవు

గీ. సిగ్గుయెగ్గులు విడనాడి క్షితితలమున
పాపవిత్తంబు నార్జించు బడుగులకును
వివిధవేషలు భూషలు వేడ్కసేయు
అరయ నాకేమి ముదమిచ్చు నార్యవినుత!

కావున యిటువంటి శృంగారవిషయికములకు నన్ను లోనుజేసి స్వర్గ ద్వారంబు చేయవలదు. నిలుకడలేని నామానసంబెట్టులో మీాదయవల్ల నింతదనుకను గట్టిపెట్టితిని. అట్టిదానిని మీారు విప్పబూనుట పాడియే?

శ్యామ—చెలీ! నాయొక్క మమకారముఁగాలదిని నేదెచ్చితి. నన్నుఁ చిన్నబుచ్చక స్వీకరింపుము.

కామ—అయ్యో. తమరే యిట్లు నడిపినచో నేనేమనగలదానను. ఈయలంకారములు ధరించినచో నామనంబెట్లు మారిపోయి నేనేదుర్గతుల జెందుదునో యని భయపడుచుంటి.

శ్యామ—కామా! కుమ్మరపురుగు బురదలో సర్వకాలసర్వావస్థల యందున పొర్లుచుండినను దాని కిసుమంతయేని యామాలి న్యమంటుచుండెనా? అట్లనే మనమీ బాహ్యప్రపంచమందు వ్యవహరించుచున్నంతకాలము సర్వసుఖము లనుభవించుచు, జాగ్రదావస్థతో వర్తించిన నిసుమంతయు దోసగు రానేరదు. సంసారములో మెలగుచు ముక్తినొందినవారలే యెక్కుడు ఘనులు కావున నామాట పాటింపుము.

కామ—పతియాజ్ఞయే పరమోదాయకముగదా, ఇట్టితఱి తమ యాజ్ఞ నిరాకరించినచో కలుషములు ఘటించును. అందుచే తప్పక శిరసావహించితిని.

శ్యామ—సుందరీ! కామిగాక మోక్షకామిగాడు యను నార్యోక్తిని బట్టి మన మనుసరించినచో సర్వవిషయములు మనకు తేట తెల్లమగును.

కామ—నాథా! నేడు శనిత్రయోదశియని శలవిచ్చితిరిగదా,యీగాథ నింక గట్టిపెట్టి శివపురాణంబు పఠింతమా?

శ్యామ—అట్టులే ప్రారంభింతము. ఇచ్చట గాలియాడుటలేదు. మేడపైకిఁ బోదము. అచట కాలక్షేపము చేయవచ్చు.

కామ—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(అవనిక జారును)

## ద్వితీయ రంగము.

—oo:o—

### హేమకళగృహము.

(తెరలేచుసరికి, హేమకళయు సుందరారావు గూర్చునియుందురు.)

హేమ__సుందరా! నేచెప్పినవన్నియు జ్ఞాపకమున్నవా?

సుంద__ఆ! నీకన్నియు లోటులేకుండ సరఫరా చేస్తేచాలుగదా.

హేమ__సరియేగాని కామిసెట్టివద్దకు వెళ్ళి నేను గతరాత్రి చెప్పిన ప్రకారం వెంటనే పంపమనియు భోజనమైనవెంటనే బయలుదేరి మేజువాణిచూచుటకు రమ్మనమనియు చెప్పి దగ్గరయుండి వెంట తీసికొనిరమ్ము!

(సరహరి ప్రవేశించి) అమ్మాయీ!

హేమ__ఏమమ్మా!

సర__అయితే నిన్నటి పిలుపులో మీయక్కను పిలువుమని చెప్పితివా లేదా?

హేమ__(కోపముతో) అది నాకెచ్చటియక్క నేదానికెచ్చటి చెల్లెలను. నాసవతి నేబ్రతికియుండగా దానిని కన్నెత్తి యైనను జూతునా?

సుంద__ఇట్టిసమయమున పిలువకపోయినచో బాగాయుండదు.

హేమ__నీయభిమానము మండినట్లేయున్నది కొంగుతగిలినా కొంత తీరునని యేడుస్తావు. యీవిషయమై నిన్నెవరును ప్రశ్నించియుండలేదు. నోరుమూసికొని యూరకుండుము.

సుంద__ఓసి నీయమ్మకడుపు బంగారంగాను నేనంటేనేనల్లేరుమీదకు బండిపోయినట్లు చొరవగా వచ్చెదవు యిది యేమి పాపమే?

హేమ__నీవన్నను నీగుణములన్నను నాయొడలు మండిపోవును.

సర__అబ్బ! అతగాడితో నేమి యిటుచూడుము.

హేమ—ఎందుకమ్మా!

నర—మరేమీలేదు. నీవు చిన్నదానవు నామాటవిను. దానినిపిలువక పోయినచో పెద్దముండయుండియు యింత కాఠిన్యము వహించినదాయని లోకులు నన్ను దూషించెదరు.

హేమ—నాకాసంగతి తెలియదు. నేదానితో మాట్లాడను. కన్నెత్తియైనను చూడను. నీకు యిష్టమైనచో పిలువుము.

నర—పిలిచెదను. మననిష్ఠూరముండదు. వచ్చినచో భోజనముచేసి నలుగురితోపాటు వెడలిపోవును.

హేమ—వచ్చి యిచట వెట్టిమొట్టికూతలు గూసినచో నేనసహించుదానను గానుసుమా! జాగ్రత.

నర—సరేలే. మేజువాణీలో వసువుళ్ళు దొరుకునుగాన క్రొత్త పాత సరసులందరికిని వర్తమానించు.

హేమ—ఆసంగతియే యిప్పుడు సుందరంతో ముచ్చటించుచుంటిని.

సుంద—అత్తా! ఉన్నాడుగా యిచట పాపాలభైరవుడు టపామోయుటకు.

నర—నీసానికొరకు చేసెదవు నాకొరకా? అమ్మో భోజనములను వచ్చుచున్నారు. నేలోనకు వెళ్ళెద. (నిష్క్రమించును)

హేమ—సుందరా! పోయిరమ్మా. సెట్టితోపాటు మిగతావారలను కూడా ఆదారినే ఆహ్వానించుము.

సుంద—మంచిది—(నిష్క్రమించును)

(ఆనందరావు వీధిగుమ్మమువద్ద ప్రవేసించి) యీ హేమకళ యీయూరిసానులందరిలో కొంచెము పచ్చిగాయున్నట్టు నాకుసమాచారము తెలియవచ్చినది. ఎందరికొంపలు నట్టేటగట్టి యీధనము సంపాదించినదో దీనికొంప నేనడిసముద్రములో గట్టెదగాక (లోపలి కేగి) యీగృహమెవరిది?

హేమ—(లేచి) వేశ్యలది.

ఆనం—నీ పేరు?

హేమ—హేమకళ. నిలుచుండియే సంభాషించుచుంటిరి. ఆయాసనముపై గూర్చుండుడు.

ఆనం—(కూర్చుని) ఓహో! నీవేనా

హేమ—అదియేమి యటుల శలవిచ్చుచుంటిరి?

ఆనం—మరేమియు లేదు. నీ పేరు, నీచాకచక్యము, నీయందము, కొలది రోజులక్రితము నేవినియుంటిని అప్పటినుండియు నిన్నొకచేయి చూడవలెనని కుతూహలపడుచుంటి ఎప్పటికప్పుడే నేనో మా టంకమువల్ల యీగ్రామము వచ్చుటకుగాని నిన్నుజూచుటకు గాని వీలులేకపోయినది. నేవినినందుకు యిప్పుడు నిన్నుస్వయముగా చూచినందుకు సరిపోయినది. ఏదీ! ఒకముద్దిమ్మా.

హేమ—అబ్బ! ఏమాచుట్టరికము?

ఆనం—సానులకును సరసులకును దగ్గిరచుట్టరికమేగదా?

హేమ—అయినంతమాత్రమునచే ముద్దులు తేరగావచ్చునా?

ఆనం—తేరగా నీవిచ్చినను పుచ్చుకొనువాడెవడు? నీపసుపుకూటికాసించి గతిలేనివాడు పుచ్చుకొనును. తెలిసినదా?

హేమ—ఆగ్రహింపవలదు. తమకు తెలియనిధర్మము లున్నవా;

ఆనం—ఏదీ ఆకాసులపేరు నూతనఫక్కీగాయున్నదే? యిటురమ్మా.

హేమ—(దగ్గరకువచ్చి నిలుచుండును)

ఆనం—(కాసులుపేరు కరమునబట్టిచూచుచుండ)

హేమ—ఏమిటండీ యీసరసము (దూరముతొలగి నిలచుండును)

ఆనం—ఏమది యట్లుబెదరిపోతివి. పట్టుచూచినంతమాత్రమున నేయరిగిపోవునా? లేకనలిగిపోవునా? కాకనేనపహరింతుననుకొంటివా కొత్తగాయుండుటచే మచ్చుచూడనెంచితిని. అదియునుగాక

యది బంగారమో కాదో యని సంశయించితిని. నీవదితప్పు గానెంచినయెడల నిదిగో జరిమానా యిచ్చుచున్నాడ. (నోట్లు యిచ్చును)

హేమ——(నవ్వుచు తీసికొనును)

ఆనం——భయముతీరినదా రమ్మా ఇటువచ్చి కూర్చుండుము. (తనతొడ చూపించును)

హేమ——(సిగ్గుతో తలవంచికొనును)

ఆనం——అబ్బా రమ్మంటే.

హేమ——ఎవరైన విన్నను చూచినను సిగ్గులచేటు.

ఆనం——మనకు సిగ్గేమిటోయి. నీవు సానివి నే సరసుడను. ఎవరైనను వచ్చిచూచినచో వారే సిగ్గుపడి వెనుకకు మరలవలెనుగాని మనకేల. (పట్టి తీసికొనివచ్చి తనతొడపై గూర్చుండబెట్టుకొనును)

హేమ——(సిగ్గుతో ముఖమువాల్చి) తమదేగ్రామము?

ఆనం——ఇచటికి చాలాదూరము.

హేమ——అనగా

ఆనం——అనగా నెల్లూరుజిల్లా కోతలపాలెం మాగ్రామము.

హేమ——ఇచటి కేమిపనిమీద దయచేసినారు?

ఆనం——చెప్పితినిగదా నీమీద వలపుచేతయని. (లోనికితొంగిచూచి) మీగృహములో నేడు యేదో కార్యములాగున గాన్పించుచున్నదే.

హేమ——నేడు నే పుట్టినదినమగుటవల్ల మాబంధుగులను విందుకు బిలచినారము

ఆనం——వహ్వా! వహ్వా! నీవుపుట్టినరోజు, నేపెట్టిపుట్టినరోజు.

హేమ——అదేల?

ఆనం.—పలావుభోజనము నాకుగూడా తగులునని-

హేమ.—ఇంతమాత్రమునకే. మీవద్ద యింకేమైనసొమ్మేయున్నదా

ఆనం.—కావలసినంత- ఎందులకు ?

హేమ.—ఈరోజున మాయింటిఖర్చునకు పరిమితిలేదు- భోజనముఖర్చుకన్న త్రాగుడుకు పదిరెట్లు ఖర్చుహెచ్చు-ఆబాలగోపాలము త్రాగెడువారే- మీకు కావలయునంటే తిరుగా యిచ్చెదనులెండు-

ఆనం.—ఈమాత్రముభాగ్యమునకు తిరుగ యివ్వవలెనా? స్నేహము కలియువరకేగాని, కలిసినపిమ్మట నీదినాదీ యను భేదమేమి ? యేమాత్రముకావలెను ?

హేమ.—రెండుమూడువందలున్న నాపరువు నిలచును-

ఆనం.—(జేబునుండి తీసియిచ్చి) యిదందయు త్రాగుళ్ళకేనా ?

హేమ.—ఏమిచేయనండి. మాయిండ్లలో యుండే ఖర్మమేయిది,చచ్చినా, పుట్టినా మొదట యిదిలేనిదే కార్యము గడువనేరదు. ఖర్చుపెట్టకపోయినచో మావాళ్లే మాబ్రతుకు బాజారునబెట్టుదురు. మీరు నేడు మాయింటికి దేవుడులాగ వచ్చినందుచే నాపరువు నిలచినది.

ఆనం.—సరేకాని నాకేమైన వాటాయున్నదా?

హేమ.—సరిసరి యెంతమాట-

ఆనం.—మనగదియేది?

హేమ.—ఇంటినిండుగ చుట్టములండి- రేపటిదినమున మనము స్వేచ్ఛానుసారము మెలగవచ్చును.

ఆనం.—అబ్బో! చాలదూరపుమాట-

హేమ.—మంచిచెడ్డలుగాని సమయాసమయములుగాని,వీలుసాలుగాని చూడవలదా? తొందరపడకురాజా! (చిన్నముద్దుగొనును)

ఆనం.—వాడికాపాటి జ్ఞానమున్న యింకేమికావలయును.

హేమ—ఎవరికి?

ఆనం.—ఇంకెవరికి-పుష్పబాణునికి- కావున నామాటవిని యేదో-తెలసినదా? (గడ్డము పట్టుకొనును)

హేమ—నామాట వినవా?

ఆనం.—ఆమరుడు వినడు, నన్ను విననీయడు, చావనా-

హేమ—అబ్బ! మీతో యమయాతన వచ్చినదే-

ఆనం.—నీకు యమయాతన, నాకా మరునియాతన. తెలసినదా? (పైటచెరగు బట్టి లాగును)

హేమ—(బుగ్గలు నులుముచు) ఏమాయాగడము?

ఆనం.—ఓసి! తీగడములుదీయుచు, కాలహరణముచే నన్ను చంపుచుంటివేమే? (కౌగలించుకొనబోవును)

హేమ—(తొలగి) అమ్మా! (తల్లిని పిలచును)

నర—(ప్రవేశించి) ఈతడెవరు?

హేమ—(రూపాయలు చేతనుంచి) మీయల్లుడు---అమ్మా! సెట్టి వచ్చిన లోపల భోజనములు పెట్టుచున్నదనిచెప్పి యిచటనే కూర్చుండబెట్టుము. వెంకప్పనుబిలచి తివాచీలు బరపించి, సుగంధద్రవ్యములు, తాంబూలములు వగయిరాలు యేర్పాటుచేయించు, (ఆనందరావునుచూచి సైగచేయును)

ఆనం.—(లేచి హేమతో నిష్క్రమించును)

నర—(నోట్లు లెఖపెట్టి సంతోషముతో తలపంకించుచు) వెంకప్పా! (పిలచును)

వెంక—(ప్రవేశించి) అమ్మా! యెందులకు బిలచినావు?

నర—ఇచట తివాచీలుపరచి, తాంబూలములు, సుగంధద్రవ్యములు వగయిరాలు సిద్ధపరచుము.

వెంక—(అన్నియు సిద్ధపరచును)

(కామిసెట్టియు, సుందరారావు ప్రవేశము)

కామి—పంతులుగారూ! యింకా యేవీలేందే వూరుకుముందరే తొందరపెట్టి పద్దులుసూసుకోకుండా తీసుకొచ్చారుగందా-

నర—సెట్టిగారూ! అన్నియు సిద్ధమైనవి. ఆలస్యములేదు. లోపల సానులు ముస్తీబగుచుండిరి. ఇటుదయచేసి కూర్చుండుడు.

కామి—కూకుంటానులే- పిల్లేది?

నర—లోన బంధువులకు మర్యాదచేయుచున్నది.

కామి—మాకోమరి?

నర—వారలను పంపివేసి వచ్చును.

కామి—యాపాయలకు కబురంపించి, ఇదిగో (ఇచ్చును)

నర—(పుచ్చుకొని) కొంచెము విసరుమందురా?

కామి—ఒద్దు.

నర—సుందరం! మునుపటివలె నలవాటున చటాలున లోనకు వెళ్ళెదవుసుమా-సంసారులు భోజనము చేయుచున్నారు.

సుంద—(తనలో) ఏదో మిడతవాలినట్టుంది (ప్రకాశముగా) నాకు మాత్రము తెలియదా యేమి?

కామి—నరారీ! ఆడోళ్ళు వొచ్చేలోపల మొగోళ్ళు చుతులు చరి చేసుకుంటే మంచిదిగాదూ!

నర—వాళ్ళందరును సిద్ధపడియే యుండిరి-

కామి—అయితే మేజువాణీకి పైసానులెవరు?

నర—పైవారలు దేవయాన, కమలాక్షి-

కామి—మంచోళ్ళె-

(హేమకళ ప్రవేశము)

హేమ—ఒహూ! సెట్టిగారా!

కామి——ఊఁ. ఆకన్నువాచి యెఱ్ఱిగావుందేమి?

హేమ.-ఏమోనండినాలుగురోజులనుంచియెరుపెక్కి సీరుగారుచున్నది.

కామి——యెవళ్ళకో ఆచపెట్టావు.

హేమ——ఇంకెవరికి మీకే.

కామి——యేమిటి?

హేమ——లెంపకాయలు.

కామి——చరేలే. యివన్నియు మామూలుమాటలే. మేజువాణీ సప్పున కానియ్యి.

(ఆనందరావు ప్రవేశము.)

ఆనం——(వచ్చికూర్చుండును)

కామి——యేమా! ఇతడెవరు?

హేమ——మాపెద్దమ్మకుమారుడు. కార్యమని యుత్తరము వ్రాస్తే వచ్చినాడు.

సుంద——(తనలో) పెద్దమ్మకుమారుడుగాదు. నీకు మారుడు

(దేవయానయు కమలాక్షియు ప్రవేశించి నిలుచుందురు)

కామి——(దేవయానను జూపి హేమతో) ఇది రంగిచెల్లెలుగాదా?

హేమ——అవునండీ మీమరదలే.

కామి——ఏమిటే! ఎంతచప్పున పెరిగినది తోటకూర స్తంభములాగున. ఆనమా లేపట్టలేకపోతిని. బొంతకాకిలాగుంటే ఎవరోయను కొంటి.

దేవ——(సిగ్గుచే తలవంచి నిలచును)

హేమ——ఏడిశావులే.

కామ——ఎట్టిమొగవా! సెత్తోరం వొచ్చిందా యేమిటినీకు, నేనవ్వుతూ యుంటె యేడిశావంటావుఇంతమందిలో యింతమాటంటావుగా

హేమ——పరాయిమనుష్యులు లేరు.

కామి—ఉండకపోతేమాత్రరం. కాని యి త్రిరీబల్లలాగవున్న ఆపిల్ల యెవరు?

హేమ—(తనలో) నీయుపమానములు కాలినట్లేయున్నవి. (ప్రకాశముగా) సెట్టిగారూ! మేజువాణీ చెయ్యనివ్వరాయేమి!

కామి—నేకొద్దన్నానా యేంటి కొయ్యబొమ్మల్లాగ నిలుసుంటే వ్రాసిబోక అన్నాను. నువ్వే గజ్జకట్టాలి.

(హేమ దేవయాన కమలాక్షి నరహరి వరుసను నిలుచుందురు. పిడేలు మద్దెలగాండ్రు ప్రక్కన నిలువబడుదురు. హార్మోనియమువాడు వెనుకతట్టున శ్రుతివేయుచుండును.)

హేమ—(సభకు నమస్కరించి) సెట్టిగారు! ఏమిపాడము

కామి—నీయిట్టం-మంచిజావళీ అభినయంతో పాడాలి

హేమ—(పాడుట మొదలుపెట్టును హంగుదార్లు అదియే తిరుగా పాడుదురు)

జావళీ-మట్టు.

(పల్లవి) కామీసెట్టిని గూడినా-నారంగా ॥కామీ॥

(చరణం) గేదేతామర బొట్టూ-యింకా-వదలీనావాట్టూ-యిదిజూచిజడిసే పపపపదరా-నారంగా-॥కామీ॥

2 రంగానాయకినీతో- చెంగాటనేవిధిని- బెంగాలేకుండే పపపపనురా-నారంగా ॥కామీ॥

కామి—మొదటనే నాభరతం పట్టావు. చరేలే.

2. జావళీ-మట్టు.

సెట్టీ యువర్ స్టేయింగ్ బట్టీ!
మేనెల్ల మంటలు బుట్టూ!

నిజమాడితె మీాపై నొట్టూ!
దూసాని అవురత్ చేబట్టూ ॥సెట్టీ॥
నీబాడీ చెమటాసెల్లూ। నీయేబిబుడ్డీనొల్లూ। నీబ్లాక్కల్లర్ తీసూ-
దానిజూచిఫియరొందితిని ॥సెట్టీ॥
నీబాత్ డాంకీకూత। నీబ్యూటీ యిలలోనాహి। నీలిప్సుచాదూకోలు।
నీఫేస్‌బందర్‌బోలు ॥సెట్టి॥
మాహౌసునుండికజావ్రూ। వీరాణిజభూషణుతోడూ। నీపొందుగూడే
దురంగీ। పల్మారు మొక్కుము వంగీ ॥సెట్టి॥
3 (హాపి్రయానను బాసితేవలె)
సరసమాడను- సానెబిలువగ- జేరవేలర- కోమటీ॥
పిరికిలేకను- దరికిజేరుము- వారిజాక్షిని- గూడుమా ॥సర॥
పారుబోతుల- తీరునీవును- బారిపోవుట- పాడియే॥
కూరగాయల- బేరమాడక- కీరవాణిని- జేరుమా ॥సర॥
(సుందరాంగివు వంకదిరిగి)
నిన్న రేతిరి- చిన్నదానికి- కన్నుగొట్టిన- పంతులూ
ధనముగల్గిన- వన్నెచిన్నెల- కన్నెమిన్నను- బొందుమా ॥నిన్న॥
సన్నలేలను- పొన్నపూవులు- సన్నబట్టలు- గూర్చినా
వెన్నుముదరని- చిన్నచన్నుల- సన్నుతాంగిని- బంపెదా ॥నిన్న॥
కామి.—యేమా! మంచియిపాడు.
హేమ.—అట్లనే. యిదుగో యీాజావళీ పూర్తిగావినుడు.
వారకాంతల- పడపువృత్తులు- బారదోలుము- శంకరా
కరముమీారగ- వీరరాజుకు- వరములొసగిన- యీశ్వరా ॥సర॥
(అమీానా కొండయ్యనాయుడును మారువాడీ. గోపీచందుప్రవేశము.)
(యిరువురునువచ్చి సభలో కూర్చుందురు, సెట్టి సిగ్గుపడును
హేమకళ నమస్కరించును.)

సుంద—ఏమండోయి! గోపీచెందుగారు? దారితప్పివచ్చినారు?

గోపీ—సెట్టిగారితో మాకీ పనివుండి.

హేమ—(యిరువురకును తాంబూల మొసగును.)

సెట్టి—(జడియుచు) చేడ్జీగారూ! నాకోసమా? ఎంతమాట! కబురంపితే నేను రాకపోతినా!

కొండ—ఎన్నిసార్లు కబురుపంపించినను రాకపోయితిరట. మీయింటికి వెళ్ళియుంటే మీదర్శనము లేకపోయినది. దివాణంలో తప్పక యుందురని తలంచి వచ్చినాము.

సెట్టి—చరే. రండిపోదాము.

కొండ—యీశుభలేఖమీద కొంచెము మీచేవ్రాలు కావలసియున్నది సంతకము చేయుడు. పిమ్మట పోవచ్చును. (వారంటు కాగితము కలము చేతికిచ్చును.)

సెట్టి—(పుచ్చుకొని చూచి వెల్లికిలబడి కండ్లుమూయును)

(హేమ మొదలగువా రందరును చుట్టుమూగికొందురు.)

కొండ—మీరందరును దూరముగా తొలగుఁడు. సెట్టి! సెట్టి! (తట్టి లేపును)

సెట్టి—(లేచి యిటునటు పరికించి) చేడ్జీగారూ! ఎంతపని చేయించారండి మెదవడబ్బుకోసం. పరువుతీయుటా?

గోపీ—కాకపోతేయేమ్మి. నీకంత యబిమానముంటే మాదిడబ్బు యిప్పుడు పైసలాచేయి.

సెట్టి—మాయింటికివెళ్లి మాకురోడ్రిడినడిగితే పారేసును. మీడబ్బు తిన్నామనుకొంటిరా? యెవారంమీద పెట్టాను.

గోపీ—(వేశ్యలనుజూపి) యీాళ్ళబేపారమునకేనా?

కొండ—మాటలతో కాలయాపన వీలులేదు. సొమ్ము ఇచ్చెదవా? లేక జెయిలుకు వచ్చెదవా?

స్వర—(హేమతో రహస్యముగ) సెట్టి, నీనగలుయిమ్మని యడిగినచో యిచ్చెదవు జాగ్రత్త.

హేమ—నేనెందుకిత్తును?

సెట్టి—అమీనాగారు? తొందరపడకండి. (కన్నుగిలుపుచు గోపికును)

గోపీ—(కనిపెట్టి) కొండయ్యా! తీసుకు నడువుము.

సెట్టి—గుర్రాన్ని దిగండి చేడ్జిగారు. మీసొమ్ముకు యెంతమాత్రం పరవాలేదు. మాయింటికెల్లి నేను చెప్పానని మాఅయ్యల్లగాడ్ని అడగండి యిస్తాడు.

గోపీ—మాకా అవుసరంలేదు. వాడే కోర్టుకు తెచ్చి నిన్ను విడిపించునులే.

సెట్టి—యేమా! కాదుకాదు. చేడ్జిగారూ! మొత్తంబాకీయెంత ?

గోపీ—పదిహేనువేయి యివ్వాల.

సెట్టి—సచ్చుబాకీ. యేమా యిల్లారా.

హేమ—(వచ్చినిలుచును)

సెట్టి—చూడు. యీమారువాడీ బాకీ యెట్లనో సర్దుబాటుచేయి. యింటికెల్లగానే పంపుతాను.

హేమ—నావద్ద కింతధన మెటనుండి వచ్చినదని మీరూహించినన్నడుగు చున్నారు?

సెట్టి—అబ్బా! రోగంరొట్టు, యెవారంగుట్టు అన్నాడు. అదంతా యెందుకేంటి నగలో నట్రో తాకట్టుపెట్టి తెమ్మి. లేకున్న పరువుపోతుంది.

హేమ—మీపరువు నిలువబెట్టుటకు మానుటకు మారువాడీయున్నాడు. మాకవసరములేదు, అయినను మావద్ద ధనమెక్కడిది?

సెట్టి—ఈనెలలో నేగెందా సుమారు ఆరువేలు యిచ్చాను.

హేమ—నీమొగమేనా యిచ్చినది? వినినవారు నవ్వుదురు వూరకుం డుము. అమీనాగారు! యితనిని యిచటినుంచితీసుకుపొండు!

సెట్టి—ఆ యెంతమాట! కళ్లు నెత్తికొచ్చినాయామేమి?

హేమ, నర—(అమీనాతో) చప్పున తీసుకువెళ్ళండి.

సెట్టి—నరారీ! నీవైన చెప్పవే.

నర—నేచెప్పిన వినదు బాబూ!

సెట్టి—మీతో యెవారం యింతకన్నా యెక్కువచేస్తారామేమి యె న్నోమాటలుసెప్పి డబ్బంతాలాగి సమయానికియిలాచేస్తావే రండా?

హేమ—చీ! నోరుమూయుము. పొమ్ము. ఇటనుండిలేచిపొమ్ము. (మె డపట్టి గెంటును.)

(మారువాడి అమీనా సెట్టితో నిష్క్రమింతురు)

(తెరపడును)

---

—: పు ర వీ ధి :—

(సెట్టి, అమీనా, మారువాడీ ప్రవేశము.)

సెట్టి—నామాటవిని యిప్పుడు నన్నొదిలెయ్యండి. అల్లరిఅయిపోతే మీకేనట్టం.

గోపీ—మాకేమి నష్టం.

సెట్టి—యిరసాలమెంటు పెడతాను.

కొండ—దొంగ దివాలాతీస్తే పోసిక్యూషను జాగ్రత్త.

సెట్టి—(సైగచేసి) నీకెందుకయ్యా (గోపీచందుతో) యేమండోయి! యిల్లు మాకోడలుపిల్లపేరుంది, భూములు మాదానిపేరుతో నేకొన్నాను. చరసంగా వొదిలిపెడితే యేదోకొంత తీరుత్తా.

లేకపోతే యిరసాలమెంటే. యిరసాలుమెంటు కాయంకాక పోతే జెయిలులో కూకుని మీవల్లనే జీతము పుచ్చుకుంటా.

కొండ—మీగృహమందుయున్న యినుపపెట్టి జప్తుఅయినది.

సెట్టి—అందులో యేవుంది, కొద్దిగోప్పావుంటే అది చీధనమంటాను. తెలిచిందా?

కొండ—ఈవ్యాపారము కోర్టులోనేగాని పైసలు కానట్టులున్నది-నడువుము. (నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము.

---

### కామకళ భవనము.

(తెరలేచుసరికి కామకళ భర్తయొసగిన చీనాంబరము,భూషలు ధరించి కూర్చుండును.)

కామ—కట్టా! మన్మాధుండు నేవలదు వలదన్నను వినక, నాకివి నిడుటయేగాక, ధరింపమనియు, నొక్కి వక్కాణించె. నాకివి గట్టనిచ్చలేకున్నను, నాభర్తయాజ్ఞ జవదాటనేరక వారియుద్దేశమనుసరింపవలసిన దాననైతి. స్త్రీలకు మానమే గొప్పభూషణముగదా? అట్టిదానిని గోలుపోయినపిదప నిట్టివెన్ని ధరించిన నేమిలాభము. ఇవిధరించినస్వర్గరాజ్యపదవి లభించునా? యేమి నానాధునివెఱ్ఱి!

(కందర్పుడు ప్రవేశము)

కంద—మరదలా!

కామ—(మోమెత్తిచూచి తనలో) ఎవరువీరు నేనెరుగనే, చిరపరిచితులబోలి పిలచుచుండె- (ప్రకాశముగా) అయ్యా! యెవరు మీరు? తమ నామధేయంబెద్ది?

కంద—అప్పుడే మరచితివా?

కామ—అయ్యా! క్షమింపుడు.

కంద—నీమేనత్తకుమారుడను కందర్పుడనుగానా?

కామ—కందర్పుడవో అభినవకందర్పుడవో దాని కేమిగాని నాకు మేనత్తయే లేదే? (ఆశ్చర్యము నభినయించును)

కంద—ఆశ్చర్యమువలదు. వావివరసలు కలపుటకుగాను యట్లంటిని.

కామ—పూజ్యుడా! పరస్త్రీలతో పరియాచములాడుట యనుచితము గాదా?

కంద—సానులతో సరసమాడక కన్నతల్లులతో నాడమందువాయేమి?

కామ—సానివృత్తిలో మెలంగెడివారితోడను మీయనుకూలురతోడను మీయ ధేశ్చ.

కంద—అట్లయిన నీవావృత్తిలో లేవా?

కామ—లేనని వేరుగ చెప్పవలెనా?

కంద—అతివా! పోనిమ్ము-భోగాలకొంపగదాయని లుడుంగున లోన దూరినాడను. నీకట్టియుద్దేశము లేనిచో వేరుకొంపకు బోయెద గాక! కాని నిన్నిట్లు ప్రశ్నించుట పరిహాసముగా మాత్రము నెంచవలదు. (లేచును)

కామ—అయ్యా! లేచితిరేల! కూర్చుండుడు.

కంద—ఇంకెందులకు?

కామ—మనవిచేసెదను వినుండు- నేను కొంతదనుకను సానివృత్తిలో మెలంగి యుత్కృష్టజీవనము సలిపినదాననే. కాని యందలిహేయము చెప్పనలవిగాదు- శ్రీకృష్ణభగవానుడు నాకు జ్ఞాననేత్రము ప్రసాదించినప్పటినుండియు నిహసుఖంబులు తృణప్రాయములుగానెంచి యగ్నిహోత్రములో దూకనున్న మీవంటి వారలకు యందలి బలుకష్టములు బోధించి మనస్సుద్రిప్పిమం

చిమార్గమున బెట్టుటకుగాను యూవాసుదేవుని యాజ్ఞానుసార
ము పాటుపడుచుంటి.—

గీ. సానిసంపర్క మొదవ పాపండులగును
మనసు చెడిపోవు కలిగిన మాన్యమూడు
అంగసౌష్టవమంతయు గంగకలియు
ఆలుబిడ్డలు దూరస్థు లగుట నిజము.

అని నీతిశాస్త్రములే చెప్పుచున్నవి. వారాంగనలన ప్రత్యక్షభూలోక
రాక్షసులు.—

సీ. వేడుకజూపించి విటులకు మసిబూసి
పీనుగులనుజేయు వేశ్యగాదె
తీరనిజాడ్యంబు జారుల మెడగట్టి
కష్టపెట్టగ వారకాంతగాదె
త్రాగుడు జూదంబు రంకు బొంకులు నేర్పి
గంగలో దింపంగ గణికగాదె
లక్షాధికారుల భిక్షులుగా జేయు
హంతకురాలు రోకాంతగాదె

గీ. వరతపోధనుడైనను వారకాంత
స్పర్శసుఖములు గోరిన జావకున్నె
వలదు వలదయ్యయో! వెల పడతిపొందు
పొమ్ము భార్యను చేబట్టు బొందు సుఖము.

కావున నోపరాంగనాసక్తచిత్తా! పరభామల జూచినంతటనే నీతోబు
ట్టువులుగా భావించినచో వారల యందచందములు నిన్నాక
ర్షింపజాలవు. నీకు వారలపై భ్రాంతి తొలగును. నీ నేత్రము
లు నిన్ను బాధింపంజాలవు. నీమనంబు చలించనేరదు. నా
యందు దయయుంచి నామాటలు బాటించి సదాచార సం

పన్నడవై కీర్తికాముడవై ఆలుబిడ్డల ప్రేమించుచు శ్రీకృష్ణ పరమాత్మయందునీమనంబులగ్నంబుగావించి సంచరించితివేని దానగులు నీదరికి రా వెఱచును. సుఖంబులు సర్వదా నీతోడ కేరింతములు గొట్టుచుండును. అనంతరము ముక్తి నొందగలవు

కంద—(నిర్వేరపడి మోకరించి చేతులు జోడించి) హే! జగజ్జననీ! యీకలికాలమందు పెచ్చుపెఱిగినదుండగములును పాపములును భస్మీపటలముగావింప నాకమునుండి భూలోకంబున కవతరించిన సాక్షాత్ శాంకరీ దేవివిగాని మనుజకాంతవుగావు. తల్లీ! నీనీతిబోధనామృతపానవిశేషంబున నామానసంబు నిష్కలుషంబయ్యె. దుష్టవాంఛా రహితుండనైతి. నిన్ను దర్శించుటచే నాయీనేత్రద్వయంబు ధన్యతనొందె. నాయీదేహంబు పావనంబయ్యె. సూర్యభగవాను డుదయాద్రిపై పొడసూపినంతనే చీకటిమూకలు చెల్లాచెదరైనటుల నీదృష్టి నాపై ప్రసరించినమాత్రముననే మోహాంధకారము మాయమై జ్ఞాన తేజంబునన్నావరించినది. జననీ! ధన్యుడ (నమస్కరించి వెడలిపోవును)

శ్యామ—(నవ్వుచు పోవువానివంక దిలకించుచుండును)

(శ్యామసుందమూర్తి ప్రవేశము)

శ్యామ—(చూచి సంతోషముతో) రమణీమణీ! నేడు నిశ్చయముగా లక్ష్మీదేవిని మీఱియుంటివిజుమీ?

కామ—(దీనముగ) నాథా! మీరు పొరబడుచుంటిరి. నేడు నేను ముమ్మార్తుల పచ్చిభోగకాంతను బోలియున్నాను.

శ్యామ—కాకున్న నిన్ను నీవు మెచ్చుకొందువా?

కామ—రాథాకాంతునిసాక్షిగనేనటులేయుంటిని. (మోమువంచును)

శ్యామ—దేవీ! నీవదనాంబుజంబు కళావిహీనమై జూపట్టుచున్న దేల

కామ—దేవా! మీరొసంగిన నీయమూల్య వస్త్రాలంకారములే యందులకు కారణము.

శ్యామ—అయ్యో! సంతోషమునకుమారుగ సంతాపపడుటకు వేరొండు హేతువుండియుండును.

కామ—ఆర్యా! నాయీనూతనమార్పుజూచి యెవఁడో కామాంధుఁడు లోనజనుదెంచి సరసమాడరమ్మని బిలచినాఁడు.

శ్యామ—ఇవి ధరించుటచే గాదని నామనస్సాక్షిగ చెప్పగలను.

కామ—మరిదేనివలన ?

శ్యామ—సృష్టిలోపమువలన.

కామ—నాకంతమాత్రమున బోధపడలేదు.

శ్యామ—అనగా నిన్నా బ్రహ్మ వేశ్యకులమందు బుట్టించుట చేతనే గాని నీవీయలంకారములు ధరించుటచేగాదనినమ్ముము. ఏమందువేని యెంతసింగారించుకొన్నను యాపెసంసారస్త్రీయైనచో నిర్భయంబుగ నింటజొరబడి సరసమునకు రమ్మనిగోరగలఁడా?

కామ—మీరు చెప్పినదియు కొంతవరకు యదార్థమేయైయుండవచ్చు. కాని నేనిటుల సింగారించక కాషాయాంబరములనే ధరించి తులసిమాలలు మెడనుదాల్చినచో నేవేశ్యనని తెలిసియున్నను తెలియకపోయిననుయాతడునన్నిట్లుకోరియుండఁడు. మీదుమిక్కిలి నాపై యాతనికి మమకారమే కలుగనేరదు.

శ్యామ—చెలీ! ఏదియెటులున్నను మనమీ సానివాడలో కాపురముండుటే యన్నిటికిని మూలము. కావున వేరువీధినిగృహస్థులయిండ్లమధ్య మనకొక నివాసయోగ్యమైనతావు రేపేకుదిర్చెదను. అట్లయినచో ఏవోసగులును పొసగనేరవు. చింతదక్కి యుందుము (రమ్ము పోదము)

(యిరువురును నిష్క్రమింతురు.)

(అవనిక జారును)

ఇది పంచమాంకము.

---



శ్రీపరమేశ్వరార్పణమస్తు.

# కామకళ

## షష్ఠాంకము.

—: ప్రథమరంగము :—

హేమకళ గృహము.

(ఆనందరావు ప్రవేశించి వీధిగుమ్మముచెంగట నిలుచుండి తనలో)

మొన్నటిదినమున దీనియింట పెక్కండ్రు బంధువులుండుటచే నాపాచిక పారినదికాదు. దీనితో నేననుభవింపదలచిన సుఖము సంపూర్తిగ యనుభవించినాడ. ఇంకెన్ని దినములు యనుభవించినను నిదియేగదా!

గీ. కామపీడచె కొట్టాడు ఘనుడుగూడ
కుళ్ళుముండల యదనుకు గూడజూచి
వాంఛదీరిన పిమ్మట కించ నొంది
గాంచజాలడు నద్దాని కనులతోడ.

ప్రపంచధర్మ మిటులున్నది. అయినను యీసంగతులు నాకెందులకు నేనిదే లోనబ్రవేశించి నాటోపీ నేడు వేసెదగాక (ముందుకు నడచి) హేమా! (యని పిలచును)

(తెరలో) ఎవరువారు?

ఆనం—ఇటువచ్చి చూడరాదా?

(తెరలో) చెప్పకూడదాయేమి?

ఆనం—నీమగడనే.

(వామనేత్రమునకు కట్టుగట్టి యెంగిలిచేతితో హేమకళ ప్రవేశము)

హేమ——(చూచి) ఓహో! మాబండా ఎవగోయనుకొంటిని. పరా యిమనుష్యులవలె యటు నిలుచుంటివేల? రండు. (రెండవ కరముతో కౌగలించి తీసికొనివచ్చి కూర్చుండజేయును)

ఆనం——(కూర్చుని) అదేమి? ఆనేత్రము యీకరము జాపేజీలయి నవా?

హేమ——మీకొఱకు ముడుపుగట్టితినండీ.

ఆనం——అబ్బా! ఎంతకష్టపడితివి- నన్నుకూడాకలిపి కట్టుకొనిన యెం తబాగుండును.

హేమ——ఛీ! దిక్కుమాలినవాడా యేమిమాటలు.

ఆనం——నీవు చచ్చినచో నే దిక్కుమాలినవాడనగుదును.

హేమ——అట్టే ప్రేలకు (వినోదముగా పండ్లుబిగించుచు) నే లోనకు బోయి చేతిని శుభ్రపరచివత్తును అందాక నిటనే గూర్చుండు ము. కదలితివా జాగ్రత్త (చిరిచెంపకాయ దవడమీదగొట్టి పరువెత్తి బోవును)

ఆనం——(తలపంకించుచు నవ్వుచు మెల్లన) ఈ లయలన్నియు ధనము లాగుటకొరకేగాని నిజమైనప్రేమా వల్లకాడా. మొన్నటివలె గంటకు అయిదువందలు లాగవలెనని యీతమాషాలు యీ చిలుకపలుకులును. అయిదువందలిచ్చుటకుగాదు పంచప్రాణ ములు బుచ్చుకొనుటకువచ్చిన కొంపలుదీయు కోతలపాలెం రాముడని యెరుంగదు. దానియెత్తు దానిది, నాయెత్తునాది. ఎవరివ్యాపారధర్మములు వారివి (అదిగో వచ్చుచున్నట్లున్నది తలవంచి కూర్చుండును).

హేమ——(ప్రవేశించి) రాజూ! అటుల కునికిపాట్లు పడుచుంటివేమి? రాత్రి నిదురలేకుండ దేనితోనైనను——

ఆనం.—మరే నీకు తెలియనిదేమున్నది? రాత్రి టోపీగూడెంలో సానితో సరసమాడి వచ్చినాడ.

హేమ—కాదురా—

ఆనం—అవునురా—

హేమ—పోనమ్మా- (గారాబ మభినయించును)

ఆనం—ఓలమ్మ-

హేమ—(దగ్గరవచ్చి రెండుచెవులు పట్టుకుని) ఏమా పెంకితనము.

ఆనం—మాటలు తరువాత మాట్లాడుకొనవచ్చును. కొట్లు కట్టి వేయుదురేమో ముందు రెండు మంచి బ్రాందిబుడ్లు తెప్పించు. ఇవిగో రూపాయలు (ఇచ్చును)

హేమ—(పుచ్చుకొని) అమ్మా (అని పిలచును)

నర—(ప్రవేశించి) ఎందులకే అంత కేక వేసినావు. నిద్రలో యులికి పడితిని- (చెయ్యి యడ్డముపెట్టి ఆనందరావునుజూచి) ఓహో! అల్లుడుగారా యెప్పుడు రాక-

ఆనం—నీసోదె తరువాత చెప్పవచ్చు ముందు దానివద్ద రూపాయలు తీసికొని వెంటనే రెండు పెద్దవి తెప్పించు (హేమతో) ఇవ్వ వేమే?

(హేమ ఇవ్వగా నరహరి పుచ్చుకొని వెడలిపోవును)

ఆనం—(కోటుదీసి) అబ్బా! ఇది లోపల తగిలించిరమ్మ.

హేమ—(పుచ్చుకొని లోనబెట్టితిరుగా ప్రవేశించును)

ఆనం—ఒరేనాన్నా! నంజుడుకేదేని యున్నదా లేదా?

హేమ—ఉన్నదిలెండు

ఆనం—సరేకాని గ్లాసులు నీళ్ళు వగైరాలన్నియు సిద్ధపర్చవే?

హేమ—అదే మాయమ్మ వచ్చుచున్నది సర్వపరికరములతో.

నర—(రెండుబుడ్లు గ్లాసులు తినుబండములు మొదలగువానితో ప్రవేశించి వాటినటనుంచి నిలుచుండును.)

ఆనం—(బుడ్డిమూతదీసి గ్లాసులో కొంతబోసి) అత్తా! విఘ్నేశ్వర పూజ గానిమ్ము.

నర—(గ్లాసు పుచ్చుకొని త్రాగును)

ఆనం—(వేరుగ్లాసులో మరికొంతబోసి) హేమా! కానిమ్ము.

హేమ—మన కేమితొందర అందులో యింకకొంచెముబోసి మా యమ్మకిందు త్రాగి యవతలకు బోవును.

ఆనం—(గ్లాసునిండుగ పోసియిచ్చును.)

నర—(త్రాగి వెడలిపోవును.)

ఆనం—ఒసే! మీ యింటనుండెడి బ్రాహ్మణుడు యేడి?

హేమ—(సంశయించుచు) లేడు

ఆనం—పంక్తిలో వలపక్షము కూడదు. పిలువుము మరెవరైనను యున్నచో సహా పిలువుము

హేమ—మరెవరును లేరు ఆయనతప్ప—

ఆనం—పిలువుము

హేమ—సుందరావుపంతులుగారూ! యిట్లు దయచేయుడు.

సుంద—(నిద్రజెందినవానివలె నటించుచు ప్రవేశించి) యెందులకు?

ఆనం—యిటు దయచేయుడు (కుర్చీపై కూర్చుండజేసి ఒకగ్లాసు నిండుగ యిచ్చును.)

సుంద—(త్రాగి వెడలిపోవును)

ఆనం—హేమా! నాకోటు నొకసారి యిటు తెమ్ము.

హేమ—(తెచ్చుటకు లోనబోవును)

ఆనం—(మెల్లన తనలో) యీ సారావల్ల వీరలకు మత్తుకలుగనిచో నాప్రియత్న భంగము కాగలదు. కావున నాకోటు జేబులో

తయారుచేసియుంచిన కిళ్ళీలు యిచ్చెదగాక. దానితో నేనిర్భయముగా నాకార్యము కొనసాగించుకొనవచ్చును.

హేమ.—(కోటుతో ప్రవేశించును)

ఆనం.—(కోటులోని కిళ్ళీలుదీసి) యీ రెండును మీ తల్లికి, సుందరావుకు యిచ్చిరమ్మా.

హేమ.—(పుచ్చుకొని వారలకిడి తిరుగా ప్రవేశించును)

(ఆనందరావు చిత్తుగ హేమచే ద్రావించును)

హేమ.—(నిషా హెచ్చి తూలుచు ఒరే! బబబండా! నీ వోఓఓ పాట పాడరా

ఆనం.—అట్లనే పాడెదను యీతమలము వేసికొనుము (యిచ్చును)

హేమ.—(పుచ్చుకొని నములుచు యొడిలో జేరి కూర్చుని) పాడరామరి

ఆనం.—వినెదవా?

హేమ.—(కండ్లుమూసికొని) ఊఁ.

ఆనం.—(పాడుట ప్రారంభించును)

కీర్తన.

పంచరంగులు గల్గు రామచిలుకా—పంజరములో బడితివే యో రామచిలుకా॥

హేమ.—ఊఁ.

ఆనం.—పట్టుపగ్గము లేని రామచిలుకా—బంధింపగా బడితివే యో రామచిలుకా॥

హేమ.—ఊఁ

ఆనం.—నావివరసలు లేని రామచిలుకా—వంచింపగాబడితివే యో రామచిలుకా॥

హేమ.—ఊఁ

ఆనం—కాలంబు మూడెనే రామచిలుకా—కండ్లు తెరచిచూడవేయో రామచిలుకా॥

హేమ—(నిద్రించును)

ఆనం—అయిపోయినది చిలుకపని (నేలపై పండబెట్టి మొలలోని తాళముచేతులగుత్తి గ్రహించి లోపలప్రవేశించి వస్త్రవాహన ములు బట్టలుసహా మూటగట్టి తిరుగా ప్రవేశించి హేమను యొడలిపై! నగలన్నియుదీసి మూటలోగట్టి జేబురుమాలును తడిపి దాని మోముపై గప్పి వెడలిపోవును)

(ఇంచుక సేపటికి హేమకళ కొంచెము కదలి)

చాలురా. ఇంకవలదు (అని పలువరించు)

(మరికొంత సేపటికి యిటునుంచి యటుదొర్లి తడిగుడ్డవల్ల చప్పున తెలివివచ్చి లేచి యిటునటుజూచి నిలువబడి బట్టసవరించు కొనుచు యొడ్డాణముగానక నివ్వెరపడి మెడ తడవుకొని యేమియుగానక చటాలున లోనకుబోయి తిరుగా ప్రవేశించి)

అయ్యో! దేవుడా, యింకేముంది కొంపగూలిపోయిందో (యని యరచుచు నేలబడి మూర్ఛిల్లును)

సుంద—(ప్రవేశించి చూచి హేమనులేపి) ఎందుల కంత కేకబెట్టితివి?

హేమ—అయ్యోనాయనా! యింకేమిచెప్పనోయి దేవుడా! కొంప దోచుకొనిపోయినాడురా దేవుడా! (గుండెలు బాదుకొనును)

సుంద—(లోనకుబోయి నరహరితో ప్రవేశించును)

నర—అమ్మా! యేమిటిసంగతి.

హేమ—ఏమిచెప్పనే తల్లీ! ఆ పాడుముండాకొడుకు యింట్లోవి నా యొడలివి ముక్కుపుల్లలతో బట్టలుసహా దోచుకొని పోయి నాడే నా తల్లీ. అయ్యో! అయ్యో! (యేడ్చుచు గుండెలు బాదుకొనుచు జుత్తు పీకుకొనుచుండును.)

నర—(మిడిగుడ్లువేసి కొయ్యబారి) ఆఆఆ (అనుచు క్రిందపడిపోవును)

సుంద—(హేమతో) అయ్యో! కొంపమునిగినది మీతల్లి ప్రాణము బోవుచున్నది ఇటురావే తరువాత యేడ్చెదవుగాని—

హేమ—(చూచి)అమ్మా! అమ్మా (పిలచుచునోటిలోనీరుబోయును)

సుంద—లాభము లేదు. వెంటనేడాక్టరువద్దకు గొనిపోకున్న బ్రతుకదు.

హేమ—(యేడ్చుచు) సుందరం పట్టుకో వీధియరుగుమీదకు తీసికు వెళ్ళి బండిపిలిపించి డాక్టరుయింటికి గొనిపోదము.

(యిరువురును మోసికొని పోదురు.)

(తెరవాలును)

---

## ద్వి తీ య రం గ ము.

—: కామకళ మందిరము :—

(తెరలేచుసరికి కామకళ ప్రవేశము)

కామ—(ప్రవేశించి) ఔరా! మాహేమకళ, నాసోదరి, కష్టపరంపరలలో,నొక్కమారుగా,జిక్కుకొన్నదే! ఇంతకాలమునుండియు నష్టకష్టములుబడి శరీరమమ్ముకొని గడియించినగడననంతయు పూతికపుల్లతోసహా నెవడో యపహరించుటా! నాపుట్టిల్లు, మాహేమ నివాసము, చేయుచున్నగృహము బాకీలకిందను, వేలమా! నాజనని, నన్ను గర్భవాసమునగన్నమాత, మాహేమను గొనిననాటనుండియును కన్నకూతురుకన్న కడుగారాబమున బెంచుచు కంటికి రెప్పవలెగాపాడుచుండుతల్లి, యీదారుణకృత్యములువిని గుండెలు పగిలి చచ్చుటా! జీవనోపాధిగడుపుకొనుటకైనను వీలులేకుండ రెండునేత్రములకు యంధ

త్వమా! ఆహా! ఎంతవిరుద్ధము ఎంతటిదారుణము! ఎంతటికష్టసశయోబిడ్డకు సంప్రాప్తమైనది? (ఇంచుక యోచించి) ఛీ! యీ ప్రపంచిక సౌఖ్యములు బుద్బుదప్రాయములు. ఇందులకే బుధకోటులు వీటిని పరిత్యజించి శాశ్వతసుఖానందముకొఱకే వెదుకుచుందురు. జీవకోటులు సర్వమును నేనుగాకున్న నేపైన జత్తురుగాని కల్పాంతముదాక యిట్టిగట్టుకొని నుయ్యాలలూగబోరుగదా? అందుచే మాతల్లిచావున కీషన్మాత్రమైన నేవగవను; కాని దుర్గతులపొందునని విచారించుచుంటి. మాసోదరియందు నిజమునరయనేవిధదోషమునులేదు. ప్రాపంచానుభవమెరుగని గోలయగుటచే మాతల్లిదుర్బోధనల జిక్కియిట్టిగతికి వచ్చినది. ఇందుకు నేనేమి యుపకారమొనర్చి నా సోదరిచింతలను దీర్చిసుఖములు గూర్చుదాన? (ఆలోచననభినయించును)

(శ్యామసుందరమూర్తి వార్తాపత్రికతో ప్రవేశము)

శ్యామ—(వీక్షించి) కాముడూ! సర్వమెఱిగినదానవు నీవుగూడకడు విచారమున మునుంగుటజూడ వింతగొల్పుచున్నదే!

కామ—(లేచి) నాథా! సర్వసంగపరిత్యాగము గావింపనున్న నేను విచారములజిక్కియుంటినని మీబోంట్లుదలంచుటంజూడనాకెంతయో నవ్వువచ్చుచున్నది.

శ్యామ—లేమా! నీముఖావలోకనంబుచే నేనట్లూహించితినిసుమా.

కామ—మీరు పొరబడియుంటిరి.

శ్యామ—కాకున్నచో యిటులుంటివేల?

కామ—నాథా! నేచింతాసాగరమున మునింగియుండలేదు. ఆలోచనాసాగరమందు మునిగి తేలుచు కొట్టుకొని కొట్టుకొని కట

కడకొక దిట్టమైన గట్టును జేరి యోగనిద్రాపరవశనై యుండ తమరు మేల్కొలిపితిరి.

శ్యామ—నీ యాయాలోచన యేమి? గట్టున జేరు టేమి? వివరముగా వచించు.

కామ—భూసురాగ్రిణీ! వినుండు. మనసు నెంతదిట్టతగావించి,వైరాగ్యపరివృత్తిచేఁగాలముబుచ్చుచున్నను, జనపరిదేశములు విడువనంత దనుకను, నేదేని, సంతాపక్లేశ వకారణముగనైనను, గొట్టుకొనివచ్చి, మనసును, వికలత్వమునొందించకమానదు. ప్రాపంచిక సుఖములన్ననో, బుద్బుదప్రాయములు. ఇందలిర హాస్యములన్నియు తెలిసి కొంటిని. కష్టసుఖములన్నియు,చవి జూచియుంటిని. కావున,

సీ॥ కానలకేగుచు కందమూలముదిని
మునులను దర్శించ బుద్ధిపోడమె
ముక్తికాంతలబోలి మునిపల్లెవిహరించు
మునికాంతలనుజేర బుద్ధిపోడమె
పుణ్యభూములుద్రొక్కి పూజలుసలుపుచు
ముందుగతివెదుక బుద్ధిపోడమె
వాయుభక్షణ జేసి వైకుంఠ ప్రభువేడి
ముక్తినిగాంచగా బుద్ధిపోడమె

గీ. సంతియేకాని యిహమున సుంతయేని
రక్తిలేకుండె మదికి విరక్తిదోచె
గాన నేబోదు తోడనే కానలకును
నడ్డుజెప్పిన నాతోడె నార్యచరిత.

శ్యామ—నీపరియాణమున కొటంకము జేతుననియా యానబెట్టితివి.

ముక్తిపదమునకు మార్గము వెతుకులాడు నిన్నుఁ బట్టినంతటి మూర్ఖునిగా నెంచితివా? కాని యొకటిమాత్రమున్నది.

సీ. పూదోట విహరించ చేదోడు కోరెదే
కంటక మార్గంబు దాటగలవె
కాకంబుకావన కౌగిలించెడునీవు
మృగరాజు గర్జించ భీతిపడవె
మెత్తని పాన్పులే నొత్తును నీమేను
బండశిలలపైన బండగలవె
మృష్టాన్నమిడినను మెసవంగనేరవు
కాయగూరలతోడ గడపగలవె

గీ. హారనిద్రిల్లులేకున్న నలసిపోయి
కష్టమొదవును తప్పక కానలందు
కష్టమొదవిన యామీద నిష్టతపము
జరుపజాలవు సలిపిన సఫలమవదు.

కామ.—వీటికేమిలెండు. నాపై మీకున్న మమకారముచే మీరిట్లు నుడువుచుంటిరిగాని వేరుగాదు. మహాభాగా! ఆశ్రీమన్నారాయణమూర్తిని మనసా నారాధించసంకల్పము గావించినవారలు, నడుముకట్టినచో కష్టమన్నది కానలకు బారదే? ఒకవేళ యలవడినను రెప్పపాటుతో దొలగిపోవును. కావున వీటికినేనె అచుదాననుగాను.

శ్యామ.—అట్లయినచో నేనును నీతోటివాడనె.

కామ.—అట్లైన్నటికిని పొసగనేరదు. ఏమందురేని మీతపోభంగము గావించి యశోదానందనుడు తిరుగా మిమ్ములనీశృంగారచేష్టలకు లోనుజేసె. దీనికేదేని కారణంబుండి తీరవలయు. మీచేత నేమికార్యములు జేయించనున్నాడో. అదియునుగాక యాదేవ

కీగర్భశుక్తిముక్తామణుండు మిమ్మునను నావెంట గొనిపోకుండ దలంచినట్లు నాభావమున పొడసూపుచున్నది. నన్ను మన్నింపుడు.

శ్యామ—(విచారముతో శిరమువంచును.)

కామ—ఆర్యా! నాకు నీతులుపదేశించు మీబోంట్లు విచారించుట కూడదు. ఎప్పుడో యీసంసారి తమకును యాజ్ఞనొసంగును. అందులకై వేచియుండుడు. కాని నాకొకయుపకారము చేయ ప్రార్థన.

శ్యామ—ఎట్టిదాకోరిక?

కామ—నాసర్వములోసగపాలు నాసోదరి, హేమకళకు, ధారవో యనుంటిని. మీరందుల కంగీకరించి ఆమె మంచిచెడ్డలు, తరచుగ తామరయుచు, నీతిబోధనలు సలుపుచు ఆమెముక్తికి మార్గదర్శకు లయ్యెదరుగాక.

శ్యామ—వైరాగ్యరత్నమా! ఎవరును లేకున్నచో యక్కమగడే దిక్కనులోకోక్తి నాపట్ల సార్థకముచేయ జూచుచుంటివా యేమి? చాలుచాలు.

కామ—హరిహరీ! ఎంతటిమాట శలవిచ్చితిరి. తామొకదండ్రిగా యుండి యీపెను నీతిపథమునకు దెమ్మనికోరితినిగాని వేరు గాదు. ఇదియును తమదయతో గూడుకొన్నది.

శ్యామ—నేనును తపస్సున కేగదలచియున్నాడ

కామ—అట్లయినచో సరియే కాని ఆపత్రికయందలి నేటి విశేషము లెవ్వి.

శ్యామ—నేడంతవిశేషములుయేమియు లేవుకాని అయిదువందలరూప్యములు విలువగల కట్టుకాసులపేరు అణాడబ్బులద్దెకాసపడి సానులకిచ్చియున్నచో నది యవశాత్తు నితరులచే నపహరించ

బడినప్పు డందలి నష్టకష్టములు సానుల కేమియునిమిత్తములేద నియు సొంతదారులే యనుభవించి తీరవలయునని యు హైకోర్టువారు తీర్పుచెప్పియున్నారు.

కామ—సరియే, చక్కనితీర్పు. నాప్రయాణసన్నాహము వేగముగా జరిగించవలయుగాన బోదమురండు.

(యిరువురు నిష్క్రమింతురు.)

(తెరవాలును)

---

## తృతీయరంగము

చిల్లరదుకాణము.

(తెరలేచుసరికి కామిశెట్టి దుకాణముమీదకూర్చొని కొనుటకువచ్చినవారలకు సరకులిచ్చుచుండును.)

(సుందరావు ప్రవేశము)

సుంద—(ప్రవేశించి) కామిసెట్టీ! తిరుగాదుకాణము యెప్పుడు బెట్టితివోయి?

కామి—(నవ్వుచు) యీలా దయసేయండి. అప్పుడే పెట్టి వారమయినది.

సుంద—వారంట్లు, జప్తులు యేమయినవి?

కామి—ఒక యిరసాలమెంటు పిటీషనుతో తుడుచుకుపోయినాయి (రహస్యముగ) అయి తేనిందులో కొంచెం రిసీవరుగారికి మేత పెట్టినాను. అందుచే టపాకాయి పేలినట్టు పేలిపోయినది. ఏదీ! ఆళ్ళ ఓరంటు—

సుంద—నీవు మహా చెడ్డవాడవోయి, కాని దిక్కుమాలిన ముండకు చాలా ధనమిచ్చియుంటివి.

కామి—నాదేవుంది ఒక్కపైసాఅయినను నాదిపోలేదు.

సుంద—నీది కాకున్న మరెవరిది ?

కామి—మారువాడీ దగ్గర తెచ్చాదానికెట్టా కాకపోతే యీ మారువాడీ కింతాశా ! నూటికి నెల ఒకటింటికి రెండురూపా యలు, వొడ్డీపుచ్చుకుంటాడా! అసలు యెగేసేవోళ్లే యింత వొడ్డీకి తీసుకుంటారు. ఆమారువోడీ మొన్న మా దుకాణం ముందునుంచే వెళుతూ తల వొంచుకున్నాడు. ఎందుకు? నా వొద్ద యెచ్చువొడ్డీ పుచ్చుకున్నానని చిగ్గుచేత. యీళ్ళను మన దేచంలోనుంచి యెల్లగొట్టకబోతే యెవారాలు పాడు పాడు. అయితే మీరెల్తున్నారా లేదా ?

సుంధ—లేదు. అప్పుడే మానివేసితిని.

కామి—పోమ్మందా యేమి ?

సుంద—నీకు తెలియలేదా యేమి. దాని రెండు కండ్లునుపోయినవి.

కామి—తెల్పింది-రోగాలు కళ్ళకిబట్టి పోయినాయని యిన్నాను. ఆ మా టినగానే నాకు భయమేసి అదేదోసూడండి సూదితో గుచ్చి మం దెక్కిస్తారు.

సుంద—యిన్‌జంక్షను.

కామి—ఏంటి ! యిక్‌జిన్‌చనా? ఏదోలెండి. అది చేయించుకున్నాను. అయితే కళ్ళోతే మానేయాలా ?

సుంద—ఇంకెందుకోయి గుడ్డిముండ నుంచుకున్నానని నన్ను చూచిన వారందఱును నాక్షేపింతురు. పైగా రోగములు యొంటను జీ ర్ణించి యూపిరిలేక శల్యావశిష్టమైయున్నది. ఇట్టిస్థితిలో నే నచటికి వెళ్ళినపక్షమున సుఖపడుటకు మారుగ దానికి చాకిరీ చేయలేక చావాలి, కాని యిప్పటిలో చాలా కిఫాయతుగా కుదురును. కావలసినచో చూడుము.

కామి—ఓరిబాబల్లో! ఇంకానా. నేనుకాదుగెందానావొద్దకు, సరుకు లుకోసం వొచ్చేవారితోగూడా యీలా సెపుతున్నాను-(లేచి నిలువబడి) పంతులూ! బాగా యిను.

—పాట—

1 బోగిముచోరితో । బోయుసవారికి। పుట్టగతులు లేవూ।
2 ఇల్లువొల్లు గుల్లగు। యిహాపరములు చెడు। నిలనింతకు నీచము లేదూ ॥బోగ॥
3 లక్షలుబోసిన। లక్ష్యముజూపరు। రాక్షసులగుదురు। తలపన్।
4 వున్నడబ్బును। వూరికె బెడితిని। తక్కిటుసిబ్బెలు। తాకట్టెడితిని। అప్పువారలు చెప్పుతోతన్నిరి। సప్పుబెల్లములలాగ।నప్పలించినా ॥యీబోగ॥
5 తప్పుడుముండల। కొంపలదూరిన।ముప్పులువచ్చును।హితులారా
6 వాకిట ముందర। వాటముజూచి। లోపలబోయిన। పాకీముండలె ॥యీబోగ॥
7-బొప్పికట్టేని। రండలయిండ్లకు। బోవుటచేతనె నాకూ
8 బుద్ధివచ్చెనీ। భూతములోలబడి। బోడినైతి నిక నేమందున్
9 పొట్టకూటికే గతిలేకా। ఆలికూతలు వినలేకా। పిల్లలపోరూపడలేకా। చిల్లరంగడీ బెట్టుకొంటిని। కోవటోణ్ణిగనకా ఆ......
10 ఇప్పటికైనా మేలుకోండి।కళ్ళుదెఱుసుకొనిమసులుకోండి। ఆలుబిడ్డలా నేలుకోండి। ఆళ్ళిళ్ళకుమాత్రము బోకండి। యెత్తేతల్లితోడూ ॥బోగ॥

సుంద.—ఓరి నీయిల్లునేలగట్టా ఎంతవాడవైతివి.

కామి.—కాకపోతే మరేవిటి. యీపద్దులు కొంచెం రాసిపెట్టండి. పిప్పరమెంటుండ లెడతాగాని (కాగితము పెన్సలిచ్చును.)

(సెట్టి బాకీపద్దులు చెప్పుచుండును—సుందరావువ్రాయుచుండును.)

(మాసిచినిగినచీరధరించి, తలవిరియబోసుకొని పూర్ణాంధత్వముచేకఱ్ఱ చేబూని తడవుకొనుచు సెట్టిదుకాణముముందు కొంత దూరములో హేమకళ ప్రవేశించును.)

హేమ—(కన్నులుమూసి) అహా! నాకిట్టిగతి పట్టునని కలలోనైనను దలంచలేదు. నాసర్వస్వము బోయినను కన్నులున్నచో నా కింత విచారముండక పోవుటయేగాక భిక్షాటనమే యవసరము లేక బోవును. అయ్యో! ఇంటినిండుగను వాకిటనిండుగను సతతము వాళ్ళాడు సరసులలో నొక్కడైనను నేడు దారిజూపుటకు గానరాడే. యీకఱ్ఱయే నే నడచుటకు కొంత సాయపడుచున్నది.

సీ. మంచి రోజులలోన పంచల దిరుగాడు
విటజన మొకడును పిలువబోడు
కో యనిపిలువంగ కుక్కలవలె జేరు
జారుడొకండును జాడలేడు
కను సన్నమాత్రాన పనులను జరిగించు
రసికు డొకండును రాకయుండె
పొమ్మని గెంటిన పొమ్మనలుగురిపించు
సరసు డొకండును సాకబోడు
గీ. కొట్టితిట్టిన నింతేని కోపమునక
యూడిగంబులు చేసెడి యువకులెల్ల
నెటకుబోయిరో నాకేమి నెరుకపడదు
దారి జూపంగ నొక్కడైన తారసిలమి.

ఏమి నావెఱ్ఱి! మంచిచెడ్డ లరయకుండగ ధనమే ప్రధానముగా గొనుటచే యేకుష్ఠువానినైనను కుళ్ళువానినైనను మేము రానిత్తుము గాని నాయీస్థితిలో నేనెంత వేడినను యెదురుధనమిత్తునన్నను నన్ను కంటితోనైనను జూతురా! పరిపక్వమై పరిమళించుఫలముపై చిలుకవ్రాలి యందలి మధురరస మెట్లు గ్రోలుచున్నదో యటులనే విటులును వలసిన ధనమొసంగి యౌవనమదాం

ఘాతచే నడమెక్కియున్న వారనారీమణులను, జేపట్టి సుఖించు చుందును. మహానుభావులు - గర్వపోతున్న నాయింటికి వచ్చిన పతివ్రతాకాని గౌరవించితినో బంపితినిగాని నవ్వుమోముతోనొక డైన బోవుట నే గాంచలేదు. ఈ పాపముచేతనే కాబోలు!

ఉ. భీతియు జంకులేక కడు బెట్టును జూపుచు రాజకీవిటో
పాతరబోతు నే ధనము బంగరు బొమ్మరొ యంచు జెప్పుచున్
కోతలపాలెమాత జటు కొంపనుగూల్పగ లో దలంచి నా
జాతర జేసినాడు మనుజాధము డాతడు పస్పుకూటికే!

కోపమాపలేక మాట్లాడుచుంటిని. అత డీచాయలనున్న చో బుద్ధి బద్దలు కొట్టునంతటి మహానుభావుడు-అట్లుకొట్టినను నామనస్తాపము లన్నియు త్మటిలో దీరిపోవును. ఇట్టిబ్రతుకు బ్రతుకుట కన్న జచ్చుటయే శ్రేయము.

ఉ. చెల్లెనుసర్వసంపదలు చెల్లెను వెన్నెలబోలు రోజులున్
తల్లియుదీరిపోయె తలదాచెడి నిల్లును వేలమాయెగా
శెల్లవిధంబులన్ సుఖము లేటనుమున్నుట కండ్లుబోవుటన్
గొల్లునవేడ్వగావలసె కూటికిగుడ్డకు వేరాముపాయుచున్.

ఎంతమంది నలోయనినేడ్పించితినో ఎందఱుపతివ్రతామతల్లులు నన్నుండి తమభర్తలకుదూరమై విలపించియుండిరో యెన్నివంశములుతినతిండిలేక నిలువనీడలేక నాపేరుతో దేశాంతరముల పాలుచేసితినో నవియన్నియు నొక్కపాపపుముద్దగా బరిణమించి నన్ను జుట్టుముట్టినవి. ఇంతకన్న వేరునరక మేమున్నది. కాని

సీ. అక్కమాటలునమ్మి ననువుగావర్తించ
కలుగునే నాకిట్టి కష్టదశలు
అమ్మబోధనలెల్ల నవ్వాలదొ్రియుచో
కలుగునే నాకిట్టి కష్టదశలు

ధర్మచింతనజేసి దానంబు జేయుచో
కలుగునే నాకిట్టి కష్టదశలు
భగవంతునెపుడేని భావమునదలచ
కలుగునే నాకిట్టి కష్టదశలు
గీ. శాశ్వతం బిదియంచును సంతసమున
కనులుగానక వర్తించ కష్టమొదవె
అన్నిటికిని కారణమునే నరసిచూడ
కర్మసూత్రమెనన్నిట్లు కట్టికుడిపె

కానిమ్ము గతించినదానినిగురించి విచారించిన ప్రయోజనమేమి (కొంచెమూగి) ఏమిది నావెనుకతట్టున నెవరో మాటాడుచున్నట్టి సడివినిపించుచున్నదే (బిగ్గరగా) అయ్యా! ఎవరుమీరు.

సుంద—(చూచి సెట్టికిచూసించి) ఎవరైననీకేమిప్రశంశ నీదారిని నీవుబొమ్ము.

హేమ—(తనలో) సుందరాంగివుమాటవలె యున్నదే. (ప్రకాశముగా) అయ్యా! అంతయాగ్రహమేల పోకనిలతునా.

సుంధ—ఆగ్రహములేదు. యీాగ్రహమూలేదు. ఓశనిగ్రహమా నీమోాముచూచిన పాపమువచ్చును. పొమ్ము పొమ్ము.

హేమ—(తనలో) వెనుక నేనొకభిక్షుకుని యిటులేయంటి. ఆకష్టము నాకిప్పుడు తెలియవచ్చుచున్నది. (ప్రకాశముగా) సుందరంపంతులుగారా యేమి యీాజవాబిచ్చుచున్నది?

సుంద—ఆ- నీవుపిల్చి వదలివేసిన పిప్పియే.

సెట్టి—హేమా! నేను చెట్టిని. యీాలారా.

హేమ—అయ్యా! ఏవైపు.

సెట్టి—కుడిసేతేపురా.

హేమ—(తడవుకొనుచు వెళ్ళును)

సుంద—సెట్టీ! యీపరమచండాలుణ్ణి నిటకెందులకోయి పిలచెదవు

హేమ—అయ్యా! వచ్చినదానికై మరిపాపిబంధువు పోయినను భయము లేదు. తిట్టుడు లేక చంపివేసిన మరియు సంతసింతును.

సుంద—నిన్ను చంపినను నిజముగా పాపము లేదు.

సెట్టి—సంతులూ! నీ మత్తైనను పోయిందాయేమి. ప్రాసుకో.

(కామకళ సెట్టియింటిముందు ప్రవేశము)

కామ—నా సోదరి భిక్షాటనకై బయలుదేరెనదనియు కామిసెట్టి దుకాణమువద చూచితిమనియు కొందఱు చెప్ప నామనసుపట్ట జాలక పరుగు పరుగునవచ్చితిని. లోనకుబోయి చూచెదగాక. (కొంతదూరము నడచి హేమనుజూచి తొందరతో) హేమా! (అని కౌగలించుకొనును)

హేమ—(లోలోన్దదుఃఖించుచు మాటాడక కండ్లనీరు దుడుచుకొనుచుండును.)

కామ—చెల్లెలా! ఏడ్వవలదు. దైవగతికి మనమెవ్వరమును కర్తల ముగాము.

హేమ—

ఉ. నీతులు బోధసేయకడు నేర్పున నాడటు నీవు బిల్వగా
బూతులు దిట్టినాను మది మూఢతసంబున నందుచేతనే
భూతలమందె యాతనల బొందుచునుంటిని దిక్కుపీడి నా
చేతల లోదలంచకను చెల్లిని గావుము నీకు మ్రొక్కెదన్.

(కాళ్ళపైబడి నమస్కరించును)

కామ—(లేవనెత్తితనభుజముపై శిరమునిడికొని) అమ్మా! విచారించ వలదు. గతమంతయు మరచిపొమ్ము. నీకు తగుయేర్పాటులన్నియు గావించియేయుంటిని. నేను నేడే కాననమునకు తపస్సుచే యుదీక్షతో బోవుచుంటినిగాన నాసర్వస్వములో సగపాలు

యాస్తి నీకిచ్చెదను. మిగతాసగపాలు దానధర్మములక్రిందవిని యోగపరతును. ఇంతటినుంచి నీవు నేనిచ్చుదానితో స్వేచ్ఛగా ననుభవించుచు వ్యభిచారవృత్తిని మొదలంట జంపివేసి యీవృత్తి కడుదుఃఖభాజనమని నీతోడివారల|కుపదేశించుచు దానధర్మములు సత్కర్మలు జేయుచు బ్రహ్మచారిణీవ్రతము నవలంబించి భగవంతుని, సదా ధ్యానించుచు ముక్తిపథము గాంచుము. నేనసువులు బాయకుండ నాయిష్టదైవంబు నాకు ప్రసన్నుండయ్యేనేని మున్ముందుగ నీనేత్రదృష్టి నీకొసంగునటుల వరంబువేడెదను. భగవదనుగ్రహముచే నీనేత్రదృష్టి నీవు బడసినచో వ్యభిచారవృత్తి వేరుపురువుతో, జచ్చువరకును ప్రచారములునలుపుచు బోధనలుగావించి మూఢులగువారలను నీతిపథంబునకు దెమ్ము. రమ్ము గృహంబున కేగుదము. (సెట్టి సుందరరావులవంక మొగంబై) అయ్యలారా! మీయిరువురును మాతోటి పాటు మద్గృహంబున కరుదెంచి నేనాసోదరికి వ్రాసియిచ్చు హక్కుపత్రముపై మీసాక్షిసంతకములు చేయవేడుచుంటిని.

సుంద.— సెట్టి—అట్లనేవత్తుము నడువుము.

(అందరును నిష్క్రమింతురు)

(అవనిక జారును)

పురవీధి

(కాషాయాంబరములు ధరించి కామకళ పాడుచు ప్రవేశము)

—:పాట:—

జారత్వమిక మానుడీ—జారిణులారా॥ జార॥

పావనంబగు - భరతదేశము—నందుబుట్టియు పాపమనకను-పరువుమాలిన-పాడువృత్తుల—వ్యభిచరించుట-పాడిగాదిక॥ జార॥

సారహీనము- నరకకూపము —స్వర్గదూరము- సంతులేకను-జచ్చి
పోదురు-సర్వశూన్యము- జారకారణ- మరయజూచిన॥ జార॥
మంచిచెడ్డలు- నెంచకుండగ- సంచితంబుగ- వంచనంబగు- నీచమ
నుజుల- పంచజేరుచు- సంచరించుట- కిరించుదనమగు ॥ జార॥

సోదరీమణులారా!

సీ. సానివృత్తినిబూని సంచరించెడువారు
కులగోత్రములులేక కూలుగాక
వ్యభిచారవృత్తిచే వ్యవహరించెడువారు
సంతతిలేకుండ జచ్చుగాక
కులటలై చరియించి గుణహీనులగువారు
పొట్టకూటికె లేక బోవుగాక
రంకుపనులుజేయు రాకాసిమూకకు
ధర్మకర్తలై దిక్కు దహనపరచ

గీ. పడుపువృత్తిని జీవించు పడతులెల్ల
పాపభూయిష్టమైనట్టి బాధలంది
పుడమినింతేని సుఖములు బొందలేక
నెంచగతిలేక మతిలేక నీల్గుగాక!

(నమస్కరించి నిష్క్రమించును)

(మంగళం పాడుదురు.)

ఇది-షష్ఠాంకము సర్వము సంపూర్ణము.

(తెర వాలును.)

